# యుగోస్లావియా స్వాతంత్ర్య పోరాటం

కంభంపాటి సత్యనారాయణ
(జూనియర్)

ప్రజాశక్తి కార్యాలయం, బెజవాడ

# పరిచయం

ఈ చిన్ని పొత్తంలో యుగోస్లావియాదేశం జర్మన్ ఫాసిస్టు హంతకులచే ఎలా అకౄరమంగా ఆక్రమించబడిందీ తెలుపబడింది. యుగోస్లావియా ప్రజలు తమ మాతృదేశ స్వాతంత్ర్య స్థాపనకొరకు ఎలా కృషిచేస్తూందీ వివరించబడింది. ప్రపంచ యుద్ధంలో సోవియట్ నాయకత్వాన పోరాడుతున్న ప్రజాపక్షంలో చేరి ధైర్యోత్సాహాలతో తమ పాత్రను నిర్వహించుతున్న యుగోస్లావియా ప్రజలు ఎలా జయాలు పొందుతున్నదీ తేటతెల్లం చేయబడింది.

మనదేశంలో కొందరు దేశభక్తులు యుద్ధంలో నాజీఫాసిస్టుల ఓటమిచూసి, బ్రిటీషు సామ్రాజ్యవాదులే జయించుతున్నారని భ్రమపడుతున్నారు. యుద్ధానంతర ప్రపంచంలో బ్రిటీషు – అమెరికన్ సామ్రాజ్యవాదులు పూర్వంవలనే చిన్న దేశాల ప్రజలను, వలసదేశాల ప్రజలను బానిసత్వంలోవుంచి ప్రపంచంపై తమ పెత్తనాన్ని కొనసాగించగల్గుతారని నిస్పృహ చెందుతున్నారు. అట్టి భ్రమలను, నిరుత్సాహాన్ని తొలగించడానికి యుగోస్లావియా ప్రజల వీరోచిత పోరాటం, విజయాలు మనకొక చక్కని ఉదాహరణ.

చూడండి: మరి:: బ్రిటీషు, అమెరికన్ సామ్రాజ్యవాదులు యుగోస్లావియా, తదితర బాల్కను రాజ్యాలలో దేశాన్ని వదలి పారిపోయిన నిరంకుశ రాజులకు, దేశద్రోహులగు మిహిలోవిచ్ లాంటి వారికి తిరిగి పెత్తనం అప్పగించాలని కృషిచేశారు. కాని యుగోస్లావియా ప్రజలు సుప్రసిద్ధ కమ్యూనిస్టు - ప్రజానాయకుడు, మార్షల్ టిటో నాయకత్వాన తమ దేశాన్ని ఆక్రమించిన నాజీలతో రక్తంధారబోసి పోరాడారు. తమ దేశ స్వాతంత్ర్యం కొరకు తమ సర్వస్వం అర్పించి పోరాడగలిగినది ప్రజలేగాని, దేశాన్ని వదలి పారిపోయిన పిరికిపందలు కారని రుజువుచేశారు. ప్రజా విరోధులగు మిహిలోవిచ్‌వంటి దేశ

ద్రోహులు నాజీలతో చేతులు కలపడానికి జంకరని చరిత్రే రుజువుచేసింది. ప్రపంచమంతా మార్షల్ టిటో నాయకత్వాన పోరాడుతున్న యుగోస్లావియా ప్రజలే యుగోస్లావియా స్వాతంత్ర్య యోధులని గుర్తించింది. చివరకు బ్రిటీషు ప్రధాని చర్చిల్ కూడా జర్మన్ దుండగీడులతో మార్షల్ టిటో సైన్యాలే పోరాడుతున్నాయని అంగీకరించక తప్పిందికాదు. టిటో నాయకత్వాన ఏర్పడిన ప్రజా ప్రభుత్వాన్ని మిత్రరాజ్యాలు గుర్తించి ఆయుధాలు పంపుతున్నాయి. మిలిటరీ కమీషన్లు పంపాయి. చూడండి! నేడో! రేపో!! యుగోస్లావియా ప్రజలు జర్మన్ మూకలను తమ దేశాన్నుంచి తరిమివేస్తారు. మాతృదేశ స్వాతంత్ర్యాన్ని సాపించుకొంటారు.

ఈ చిన్నిపొత్తం యుగోస్లావియా ప్రజలు నాజీలతో పోరాడుతూ తమ దేశస్వాతంత్ర్యాన్ని స్థాపించుకోడానికి ఎలా జయప్రదంగా ముందుకు సాగుతున్నారో చూపుతోంది. ప్రపంచయుద్ధంలో ఫాసిస్టులకు వ్యతిరేకంగా సాధించబడుతూన్న ప్రజావిజయం, వివిధదేశాల ప్రజల స్వాతంత్రోద్యమాలకు ఎలా సాయపడుతూందీ తెలుపుతుంది. చరిత్ర తెలుపుతున్న యీసందేశాన్ని దేశభక్తులు గ్రహించాలని కోరుతాం. నిరుత్సాహాన్నివీడి కరువునివారణ కొరకు, దేశరక్షణ కొరకు ముందంజ వేస్తారని ఆశించుతాం.

—సంపాదకవర్గం

# యుగోస్లావియా

బాల్కన్ దేశాలలో ఒకటి యుగోస్లావియా. ఇతర బాల్కన్ దేశాలు రుమేనియా, బల్గేరియా, గ్రీసు, అల్బేనియా, యూరపియన్ టర్కీ.

ప్రపంచ రాజకీయాల్లో బాల్కన్ దేశాలు ఎప్పుడూ గొప్ప కీలకస్థానాన్ని ఆక్రమించినాయి. యూరప్‌నుంచి భూమార్గంమీదుగా ఆసియాలో ప్రవేశించాలంటే బాల్కన్లగుండా సాధ్యపడుతుంది. గొప్ప కీలక ప్రదేశమైన తూర్పు మధ్యధరాసముద్ర ప్రాంతంమీద ఆధిక్యత సంపాదించాలంటే బాల్కన్ దేశాలను వశం గావించుకొనుట అవసరం. ఎందుకంటే, యుగోస్లావియా, అల్బేనియా, గ్రీస్ దేశాలు మధ్యధరాసముద్ర తూర్పుతీరాన్ని అనుకునిఉన్నాయి. నల్లసముద్రాన్ని మధ్యధరా సముద్రాన్ని కలిపే డార్డినెల్స్ జలసంధి టర్కీలోనిదే. ఈ కారణాలవల్ల ప్రపంచాధిపత్యంకొరకు యుద్ధాలు సాగించే సామ్రాజ్యవాదులందరూ ఈ బాల్కన్ ప్రాంతంమీద అధికారం సంపాదించుటకై విశ్వప్రయత్నాలు చేసి హోరాహోరీ పోరాటాలు నడిపారు.

1914–'918 యుద్ధకాలంలోనూ, ఆ యుద్ధానికిపూర్వంగూడా "బెర్లిన్ - బాగ్దాద్ లైన్" అనే నినాదాన్ని జర్మన్ సామ్రాజ్యవాదులు లేవదీశారు. అనగా జర్మనీ ముఖ్యపట్టణమైన బెర్లిన్ నగరాన్నుంచి పర్షియా (ఇరాన్) ముఖ్యపట్టణమైన బాగ్దాద్‌వరకూ ఆధిక్యత సంపాదించుటకై ఆ రెండు పట్టణాలను కలిపే రైలుమార్గాన్ని నిర్మించి, దాని ద్వారా ఇరాక్‌దేశంలోని మోసూల్ నూనెగనులను, తరువాత క్రమేణా ఇండియా.... మొదలైన తూర్పుదేశాలను ఆక్రమించాలని జర్మన్ సామ్రాజ్యవాదులు ఆశించారు. కాని 1914 యుద్ధంలో జర్మన్ సామ్రాజ్యవాదులు దెబ్బతిన్నందువల్ల తాత్కాలికంగా ఈ నినాదం వినిపించకపోయినా, హిట్లర్ అధికారంలోకి వచ్చినతరువాత మళ్ళీ దీన్ని లేవదీశాడు. హిట్లర్ దురాక్రమణ ప్లానులనన్నిటినీ ఈనాడు రెడ్‌ఆర్మీ ఎలా శాశ్వతంగా భగ్నం చేస్తున్నదీ ప్రతివారికి తెలిసిన విషయమే.

అయితే ఈ బాల్కన్ దేశాలమీద ఇతర సామ్రాజ్యవాదులుగూడా అనేక శతాబ్దాలపాటు కన్నువేశారు. 1600 నాటికి బాల్కన్ దేశాలన్నిటిమీదా టర్కీ సామ్రాజ్యం ఆధిపత్యం వహించింది. టర్కీని బాల్కన్ దేశాలనుంచి వెళ్ళగొట్టి, తన ప్రాబల్యాన్ని ఎక్కువ చేసుకోవాలని రష్యన్ జార్‌చక్రవర్తి టర్కీతో అనేక యుద్ధాలుచేశాడు. 1730, 1792, 1807, 1828, 1853, 1877, 1914 సంవత్సరాల్లో రష్యన్ సామ్రాజ్యవాదులు బాల్కన్లకొరకు వరుసగా యుద్ధాలు సాగించారు. ఇతర సామ్రాజ్యవాదుల సహాయంతో టర్కీని వెళ్ళగొట్టి స్వతంత్రులవాలని బాల్కన్ ప్రజలు ఎదురుచూసేవారు. కాని రష్యన్

చక్రవర్తి ప్రాబల్యం బాల్కన్లలో హెచ్చుగలదనే భయంతో బ్రిటిష్, ఆస్ట్రియన్, జర్మన్ సామ్రాజ్యవాదులు రష్యాను వ్యతిరేకించేవారు ఈవిధంగా బాల్కన్‌దేశాలు అనేక సామ్రాజ్యవాద యుద్ధాలకు రంగస్థలంగా పరిణమించింది. చివరికి 1914 యుద్ధంగూడా బాల్కన్ దేశాలలోనే (సర్బియాలో) ప్రారంభమయింది।

ఎలాగైతేనేం చివరికి 1878 లో బెర్లిన్‌లో జరిగిన చారిత్రిక సమావేశ ఫలితంగా బాల్కన్ దేశాలన్నిటికి స్వాతంత్ర్యం లభించింది. టర్కిష్ సామ్రాజ్యవాదుల శక్తి క్షీణించింది. బల్గేరియా, సర్బియా, రుమేనియా, మాంటినీగ్రో దేశాలు స్వతంత్రదేశాలైనాయి. ఈ బెర్లిన్ సమావేశ ఫలితంగానే బోస్నియా, హెర్జ్‌గోవినా రాష్ట్రాలు ఆస్ట్రియన్ సామ్రాజ్యవాదుల వశమయినాయి. స్వతంత్రం పొందిన 4 బాల్కన్‌దేశాలు కలిసి 1912లో టర్కీమీద దాడిచేసి టర్కీని పూర్తిగా ఓడించినాయి. దానితో టర్కిష్ సామ్రాజ్యవాదుల పీడవదలినా, ఇతర సామ్రాజ్యవాదుల పీడ ఇంకా వదలలేదు।

టర్కీని ఓడించిన తరువాత 1912లోనే స్వతంత్రం పొందిన 4 దేశాలమధ్య తీవ్ర పోరాటం జరిగింది. ఈ యుద్ధంలో బల్గేరియా పూర్తిగా ఓడిపోయింది. మిగిలిన 3 దేశాల వైశాల్యం వృద్ధి అయింది.

1914-18 యుద్ధ ఫలితంగా బాల్కన్‌దేశాల సరిహద్దులలో మళ్ళీ మార్పులు వచ్చినాయి. ఆ యుద్ధ ఫలితంగా రష్యన్ సామ్రాజ్యం, ఆస్ట్రో-హంగేరియన్ సామ్రాజ్యం, టర్కిష్ సామ్రాజ్యం నిర్మూలించబడినాయి. శిధిలమయిన ఈ సామ్రాజ్యాలలోనుంచి కొత్తదేశాలు బయలుదేరినాయి. ఈ కొత్తదేశాలలో యుగోస్లోవియా ఒకటి.

అప్పటివరకూ ఆస్ట్రో-హంగేరియన్ సామ్రాజ్యంలో ఉన్న క్రోషియా, బాస్నియా, డాల్మేషియా, స్లవోనియా రాష్ట్రాలను, అంతకు పూర్వంనుంచి స్వతంత్ర రాజ్యాంగాలుగా ఉన్న సర్బియా, మాంటినీగ్రో దేశాలతో కలిపి ఒక నూతనరాజ్యాంగం సృష్టించబడింది. 1929 వరకూ ఈ నూతనరాజ్యాన్ని "సర్బులయొక్క, క్రోట్లయొక్క, స్లవానీస్ ప్రజలయొక్క రాజ్యం" అని పిలిచేవారు. 1929 లో వచ్చిన నూతనరాజ్యాంగ మార్పుల ఫలితంగా దేశంపేరు గూడ మారిపోయి "యుగోస్లావియా" అని పిలువబడుతోంది. యుగోస్లావియా అంటే దక్షిణాస్లావ్ దేశమని పేరు.

స్లావులు అంటే ఎవరు ? తూర్పు, నైరుతి యూరప్‌లో నివసించే రష్యన్లు, యుక్రేనియన్లు, తెల్లరష్యన్లు, పోల్సు, జెకులు, స్లావకులు, సర్బియన్లు, క్రోట్లు, స్లావనీస్ ప్రజలు, బల్గేరియన్లు— అందరినీ కలిపి, స్లావులని పిలిచేవారు. పూర్వం వీరంతా స్లావ్ తెగకు చెందినవారని అర్థం. కాని చారిత్రక పరిణామంలో కొన్నివందల సంవత్సరాల కలయికలవల్ల పూర్వపు 'తెగ' భావం నశించింది. వీరందరూ అనేక నూతనజాతులుగా ఏర్పడ్డారు. కాని రష్యన్ జారుసామ్రాజ్యవాదుల కాలంలో ఈ ప్రజలందరూ ఒకే స్లావ్ తెగకు చెందినవారనే ప్రచారాన్ని జారుప్రభుత్వం చేసింది. తూర్పు యూరప్‌లోనూ,

బాల్కన్ దేశాలలోనూ తన ప్రాబల్యాన్ని ఎక్కువచేసుకొనుటకు ఈ తెగవిద్వాంతాన్ని లేవదీసి జార్ ఒక "విశాల స్లావ్" ఉద్యమానికి నాయకత్వం వహించాడు. కాని స్వాతంత్ర్యం కొరకు ఈ జాతులవారందరూ సాగించిన ఎడతెగని పోరాటంలో జారు సామ్రాజ్యవాదుల మోసపు ప్రచారానికి తావులేకుండా పోయింది. 1917 లో సోవియట్ ప్రభుత్వం వచ్చిన తరువాత ఈస్లావ్ ఉద్యమానికి అసలే స్థానంలేకుండా పోయింది. ఈ జాతులవారికి రష్యన్ సామ్రాజ్య వాదుల భయంగూడా తీరిపోయింది. అయితే ఈనాటిగ్గూడా ఈ 'స్లావ్' ప్రజలందరికీ కొన్ని పోలికలు లేకుండా పోలేదు. ఉదాహరణానికి వారు మాట్లాడే భాష లన్నిటిలో అతిదగ్గర సంబంధాలు కన్పిస్తాయి.

యుగోస్లావియా విషయానికి వద్దాం. యుగోస్లావియా వైశాల్యం 95000 చదరపు మైళ్లు. ఇంగ్లండంత ఉంటుంది. 3 వైపులభూమి ఒకవైపున సముద్రం ఉంది. తూర్పున రుమేనియా బల్గేరియాలు; దక్షిణాన గ్రీసు అల్బేనియాలు; పడమర అడ్రియాటిక్ సముద్రం; ఉత్తరాన అస్ట్రియా, హంగెరీ దేశాలున్నాయి. అయితే 1938 లో అస్ట్రియాను జర్మనీ అక్రమించినప్పటినుంచి ఉత్తర సరిహద్దులో చిరకాలంనుంచి యుగోస్లావియా ప్రజలందరూ ద్వేషించిన జర్మన్ (ఫాసిస్టు) సామ్రాజ్యవాదులు వచ్చి చేరారు. ఉత్తరభాగంలో పడమరనుంచి తూర్పుకు ప్రవహించే ద్రావే. సావానదులు, ఈశాన్యప్రాంతంలో హంగెరీ నుంచి వస్తున్న డాన్యూబ్‌నదిలో కలిసి తూర్పు సరిహద్దులను చేరుకుంటున్నాయి. యుగోస్లావియాలో అధికభాగం కొండప్రదేశం. ఇతర బాల్కన్ దేశాలలోవలె యుగోస్లావియా ప్రజలు గూడా ఎక్కువగా వ్యవసాయంమీద అధారపడే పేద రైతులు పెద్ద పరిశ్రమలు బహుతక్కువ. రాగి, సీసపుగనులు కొద్దిగా ఉన్నాయి. ఈ గనులను ప్రవేటు కంపెనీలు బ్రిటిష్, ఫ్రెంచి వారివి.

వాయువ్యప్రాంతంలో క్రోషియా, స్లవోనియాలు; ఉత్తరాన్నుంచి దక్షిణంవరకూ తూర్పు ప్రాంతంలో సర్బియా. దేశం మధ్యలో బోస్నియా రాష్ట్రం ఉన్నాయి. పడమటి అడ్రియాటిక్ సముద్రతీరాన్ని అనుకుని డాల్మేషియా రాష్ట్రం, దాని ప్రక్కనే అల్బేనియాను అనుకుంటూ మాంటినీగ్రోప్రాంతం ఉన్నాయి.

ఉత్తర, ఈశాన్యభాగాలు మైదానప్రదేశం. మధ్యలోఉన్న బాస్నియారాష్ట్రమంతా కొండలు, అడవులు, లోయలతో నిండిఉంది. మాంటినీగ్రో అంతా ఎత్తైన కొండప్రదేశమే. అడ్రియాటిక్ సముద్రతీరాన ముఖ్యరేవుపట్టణాలు: జారా (ఇటలీకిచెందినది), స్ప్లిట్, డుబ్రోవిక్, కోటార్. క్రోషియా ముఖ్యపట్టణం జెగ్రేబ్; స్లొవేనియా ముఖ్యపట్టణం లూబ్లియానా.

1940 నాటికి యుగోస్లావియా జనసంఖ్య 1 కోటి 40 లక్షలు. వీరిలో సర్బియన్లు 65 లక్షలు; క్రోట్లు 40 లక్షలు; స్లోవనీస్ ప్రజలు 10 లక్షలు; హంగేరియన్లు 5½ లక్షలు జర్మన్లు 3 లక్షలు; మిగిలిన వారిలో అల్బేనియన్లు, బల్గేరియన్లు, మాసిడోనియన్లు మొదలైన జాతులవారెందరో ఉన్నారు. ముఖ్యపట్టణం బెల్‌గ్రేడ్.

అనేక జాతులకు చెందినవారు ఉండుటవల్ల యుగోస్లావియాలో జాతుల సమస్య ప్రాధాన్యత వహించింది. అధికసంఖ్యాకులైన సర్బియన్ల ఆధిక్యతక్రింద జాతివిభేదాలు, వైషమ్యాలు అనేకరూపాల్లో పైకి వస్తూండేవి. నిజానికి సర్బియన్లు, క్రోట్లు, స్లావనీస్ ప్రజల కంటె అన్నివిధాలా వెనుకబడియున్నవారు. సర్బియన్లకంటె జనసంఖ్యలో తక్కువ అయినా ఆస్ట్రో - హంగేరియన్ సామ్రాజ్యంలో శతాబ్దాల తరబడీ దాసిసత్వం అనుభవించి, నిద్ర మేల్కొని, విముక్తి చెందిన క్రోట్లు మిగిలిన అన్నిజాతుల వారికంటె సాంఘిక ఆర్థిక, వైజ్ఞానిక, విషయాల్లో ముందడుగు వేశారు. జనసంఖ్యలో నూటికి 30 మంది క్రోట్లు, క్రోట్ జాతీయోద్యమం బాగా అభివృద్ధి అయింది. క్రోట్ల తరువాత స్లవనీస్ ప్రజల జాతీయోద్యమం వస్తుంది సర్బియన్లు, క్రోట్లు, మాట్లాడే భాష ఒకటే అయినప్పటికి, రానేట ప్పుడు క్రోట్లు రోమన్ లిపిని వాడతారు. సర్బియన్లదంతా భూస్వామ్య యుగాలనాటి సాంప్రదాయం. క్రోట్లు, సర్బియన్లుఇద్దరూ కాధలిక్ మతస్థులే అయినా సర్బియన్లది మరీ సనాతన సాంప్రదాయం। క్రోట్లు, సర్బియన్లు, స్లావనీస్ జాతులుగాక, సర్బో-క్రోషియన్ భాషను మాట్లాడే 15 లక్షల మహమ్మదీయులు బాస్నియో రాష్ట్రంలో ఉన్నారు.

యుగోస్లావియాలోని ప్రధానసమస్య జాతుల సమస్యయే. మేల్కొన్న జాతులలో జాతీయ చైతన్యం వృద్ధిఅయింది. చాలాకాలంనుంచీ క్రోట్లు రాష్ట్రీయస్వపరిపాలనాహక్కు కొరకు ఆందోళనచేస్తూ వచ్చారు. యుగోస్లావియాలోని జాతులన్నీ 'సోదరస్లావ్' జాతులనే భావాన్ని కల్పించి, యుగోస్లావియా ప్రజలనందరిని "ఒకే జాతి"గా తయారు చేయాలని అధికసంఖ్యాకులైన సర్బియన్లు 1918 లోనే ప్రయత్నించాదు. ఈ సర్బియన్ వైఖరికి అసమ్మతి తెలియజేస్తూ క్రోట్లు, ఇతరజాతులవారు తమ నిరసనభావాన్ని ప్రదర్శించారు. కాని సర్బియన్లు వారి ప్రయత్నాలను మానలేదు. సర్బియన్‌పోలీసులను, సివిల్ ఉద్యోగులను ఇతరప్రాంతాల్లోదింపి సర్బియన్‌భూస్వాములు, సర్బియన్ పెట్టుబడిదారులు రాజ్యాంగాధికారాన్నంతా తమ చేతుల్లో ఉంచుకోవాలని ప్రయత్నించేవారు. రాజులు సర్బియన్ జాతికి చెందినవారు. 1921లో క్రోట్ల సమ్మతిలేకుండానే రాజ్యాంగాధికారాన్నంతా కేంద్రీకరిస్తూ (రాష్ట్రాలకు అధికారాలులేకుండా) ఒక చట్టం చేయబడింది. వెంటనే క్రోట్లకు-సర్బియన్లకు మధ్య రాజ్యాంగాధికారవిషయంలో తగాదాలు పెరిగినాయి. క్రోట్లు, స్లావనీస్ ప్రజలు రాష్ట్రీయ స్వపరిపాలనాహక్కును గుర్తించే ఫెడరల్ విధానాన్ని కోరారు. సర్బియన్లు లొంగలేదు. యుద్ధానంతరం ఈ తగాదాలు మరీ తీవ్రరూపం దాల్చినాయి. క్రోట్ రైతాంగపార్టీ నాయకుడు 'రాడిష్'. వైషమ్యాలుపెరిగిపోయినఫలితంగా 1928 నవంబర్‌లో యుగోస్లావ్ పార్లమెంటులో ఒక సర్బియన్ సభ్యుడు 'రాడిష్'ను కాల్చి చంపేశాదు।

వెంటనే పార్లమెంటును రద్దుచేసి అలెగ్జాండర్‌రాజు నియంతృత్వాన్ని స్థాపించాడు. 1929 లో పూర్వపు రాజ్యాంగచట్టాన్నిగూడా రద్దుచేసి అధికారాన్నంతా ఇంకా ఎక్కువగా

కేంద్రీకరించుకున్నాడు. క్రోషియా రాష్ట్రాన్నిగూడా రద్దుచేసి క్రోట్ జిల్లాలన్నీ మిగిలిన యుగోస్లావ్ జిల్లాలతో కలిపివేయబడినాయి; అన్ని రాజకీయపార్టీలు నిషేధించబడినాయి.

1931 లో కొత్త రాజ్యాంగచట్టం. దానిప్రకారం 2 శాసనసభలతోకూడిన పార్లమెంటు. పైసభలో సగంమంది సభ్యులను రాజే నియమిస్తాడు; ఈ కొత్తచట్టం క్రింద రాజుయొక్క అధికారాలు ఎక్కువైనాయి. మంత్రివర్గం తనకే బాధ్యత వహించియుండాలి. శాసనసభలకు కాదు.

కాని త్వరలోనే అలెగ్జాండర్‌కు చావు వచ్చింది. ఫ్రాన్సును దర్శించటానికి వెళ్ళినప్పుడు 1934 లో అలెగ్జాండర్‌రాజు ఒక మాసిడోనియన్ దేశభక్తునిచే ఖూనీచేయబడ్డాడు. అలెగ్జాండర్‌రాజు కొడుకైన పీటర్ అప్పుడు 11 సంవత్సరాల పిల్లవాడు. ఇప్పటి యుగోస్లావియా రాజు ఈ పీటరే. ఇతడు 1923 సెప్టెంబర్ 6 వ తేదీన పుట్టాడు. పిల్లవాడు మైనర్ అగుటవల్ల దేశాన్ని పరిపాలించుటకు అలెగ్జాండర్ దగ్గరబంధువైన పాల్, ఇంకా ఇద్దరు సలహాదార్లు నియమించబడ్డారు.

ఈపాటికి క్రోట్ జాతీయోద్యమం తిరిగి తలఎత్తింది. 'రాడిష్' చనిపోయిన తరువాత క్రోట్ రైతాంగపార్టీకి డాక్టర్ మాషక్ నాయకుడైనాడు. ప్రజలు రోజురోజుకి సోవియట్ అభిమానులుగా తయారవుతున్నారు స్వపరిపాలనా ఉద్యమం మళ్ళీ పైకివచ్చింది. క్రోషియాను పునర్నిర్మించాలనిగూడా ఆందోళన పెరిగింది దేశంలో పరిస్థితి ఇది.

బయట, జర్మనీలో ఫాసిజం బయలుదేరింది. ఫాసిస్టుల దురాక్రమణ భయం హెచ్చింది. జర్మనీ నెమ్మదిగా బాల్కన్ రాజ్యాలలో కుట్రలు ప్రారంభించింది. యుగోస్లావియా విదేశవ్యాపారంలో జర్మనీ ప్రధానస్థానాన్ని సంపాదించింది. చిన్నదేశాలైన బాల్కన్ రాజ్యాలు 1934 లో ఒక పరస్పర సహాయ ఒడంబడికను చేసుకున్నాయి. ఈ ఒడంబడికలో రుమేనియా, యుగోస్లావియా, గ్రీస్, టర్కీ మాత్రం సంతకం చేసినాయి. ఈ కూటమిలో ఏ ఒకరిమీదైనా విదేశశక్తులు (ఫాసిస్టులు) దాడిచేస్తే పరస్పరంగా సహాయం చేసుకోవాలని ఒడంబడిక. బాల్కన్ దేశాలలోని ప్రజలు ఫాసిస్టు వ్యతిరేక సంఘటనను బలపరుస్తూవచ్చారు.

ఈ పరిస్థితులలో ప్రభుత్వ పరిస్థితి ఎలాఉంది? 1935 లో ప్రధానమంత్రి అయిన స్టోయాడినోవిచ్ 1938 లో జర్మనీకి వెళ్ళివచ్చాడు. ప్రభుత్వంలో జర్మన్ అనుకూలురను వ్యతిరేకించుటకై బ్రిటిష్ ప్రభుత్వం రెండోవైపునుంచి కార్యక్రమం ప్రారంభించింది. రాజైన పాల్ అనేకసార్లు లండన్ దర్శించివచ్చాడు. ఈవిధంగా ప్రభుత్వవర్గంలో రెండు రకాల వైఖరులు స్పష్టపడుతుంటే (జర్మన్ అనుకూలురు; బ్రిటిష్ అనుకూలురు) యుగోస్లావ్ ప్రజలు ఫాసిస్టులకు వ్యతిరేకంగా సంఘటితమవుతున్న ఫ్రెంచి, సోవియట్ ప్రజల వైపుకు దృష్టిని మరల్చారు. సోవియట్ రాజ్యంమీద అభిమానం రోజురోజుకూ ప్రబలమయింది. 1938 లో ఎన్నికలు జరిగినప్పుడు నూటికి 41 మంది ప్రభుత్వానికి వ్యతిరేకం

గానూ, 59 మంది అనుకూలంగానూ వోట్లు వచ్చినాయి. అంటే ప్రభుత్వ వ్యతిరేకపక్షం బలపడుతోంది!

1939 వచ్చేసరికి యూరప్‌రాజకీయాలు అల్లకల్లోలంగా మారిపోతున్నాయి. హిట్లర్ అనేక దురాక్రమణలు సాగించి ప్రపంచయుద్ధానికే కాలు దువ్వుతున్నాడు. యుద్ధం ప్రారంభమయే పరిస్థితులు ఏర్పడ్డాయి. యుగోస్లావియా ప్రభుత్వంలోగూడా మార్పులు వచ్చినాయి. 1939 ఆగస్టు 24 వ తేదీన, ఇంకో వారంరోజులకు 2 వ సామ్రాజ్యవాద యుద్ధం ప్రారంభం కాబోయేసమయంలో మంత్రివర్గంలో మార్పులు వచ్చినాయి. ప్రజా వత్తిడి ఎక్కువయింది. క్రోట్ జాతీయనాయకుడైన డాక్టర్ మాషక్, మరిఇతర 4 గురు క్రోట్ మంత్రులు మంత్రివర్గంలో నియమించబడ్డారు. మాషక్ డెప్యూటీమంత్రి అయాడు. ఇప్పుడు క్రోషియారాష్ట్రం పునర్నిర్మించబడింది. జెగ్రేబ్ ముఖ్యపట్టణం. కొంతవరకూ స్వపరిపాలనా హక్కులనుగూడా ఇవ్వవలసివచ్చింది. పార్లమెంటును రద్దుచేసి, వోటింగు హక్కును ఎక్కువమందికి కల్గించి కొత్త ఎన్నికలు జరిపారు. యుద్ధం ప్రారంభమైన వెంటనే యుగోస్లావియా ప్రభుత్వం తాటస్థ్యాన్ని ప్రకటించింది.

సామ్రాజ్యవాద యుద్ధకాలంలో యుగోస్లావ్ ప్రజాఉద్యమాలు మిన్నుముట్టినాయి. సామ్రాజ్యవాదులవంక ఎదురుచూసే యుగోస్లావ్ ప్రభుత్వ వర్గాలమీద యువజనులు, విద్యార్థులు, రైతులు తీవ్ర ఆందోళన లేవదీశారు. కమ్యూనిస్టుల నాయకత్వంక్రింద యుద్ధాన్ని వ్యతిరేకిస్తూ వారుచేసిన బ్రహ్మాండమైన ప్రదర్శనాలు అందరికీ తెలిసినవే. సామ్రాజ్యవాద యుద్ధాన్ని ఆపి, ప్రజలను మారణహోమంలో ఆహుతిగాకుండా చేయాలని ప్రచారం గావిస్తున్న సోవియట్ యూనియన్‌మీద బాల్కన్‌ప్రజల సానుభూతి పెరిగింది. వారిలోగూడా ప్రధానంగా యుగోస్లావియా ప్రజల ఆందోళన ఉచ్చస్థాయికి వెళ్ళింది. హిట్లర్ దురాక్రమణ రేపు యుగోస్లావియామీదికే వస్తే సామ్రాజ్యవాదుల సహాయం కొరకు ఎదురుచూసే ప్రభుత్వాలు దేశాన్ని ఏం రక్షించగలవు? పోలెండు ప్రభుత్వం, ఫిన్లండు ప్రభుత్వం, ఫ్రెంచి ప్రభుత్వం ప్రజలను వదిలేసి దేశాలకు ఎలా ద్రోహం చేస్తున్నదీ చూశారు. ఈ ప్రభుత్వాలమీద ఆధారపడితే ప్రజలకు దాసిసత్వమే గతిఅవుతుందని గ్రహించారు. సోవియట్ యూనియన్‌తో ఒడంబడిక చేసుకొనే ప్రజాప్రభుత్వం కావాలని అన్నివైపులనుంచి ఆందోళన తలఎత్తింది.

హిట్లర్ — పోలెండు, డెన్మార్కు, నార్వే, హాలెండు, లక్సెంబర్గ్, బెల్జియం, ఫ్రాన్సు — దేశాలను వరుసగా ఆక్రమించాడు. 1940 జూన్‌నాటికి పశ్చిమయూరప్ అంతా హిట్లర్ వశమయింది. జూన్ నెలలోనే, తమ విద్రోహక ప్రభుత్వవర్గాలను కూలద్రోసి లాట్వియా, లిథూనియా, ఇస్తోనియా ప్రజలు సోవియట్ యూనియన్‌లో కలిసిపోవుటకు వోట్‌చేశారు. ఇక హిట్లర్ తూర్పుయూరప్‌కు తిరుగుతాడని గ్రహించి సోవియట్ యూనియన్ రుమేనియాతో ఒడంబడిక చేసుకుని రష్యన్ ప్రజలతోకూడిన 'బెసరేబియా'ను హిట్లర్‌వశం గాకుండా విముక్తి చేసుకుంది.

హిట్లర్ 1940 అక్టోబర్‌లో రుమేనియాను ఆక్రమించాడు. బల్గేరియాతో పరస్పర సహాయ ఒడంబడిక చేసుకోవాలని సోవియట్ యూనియన్ 40 నవంబరులో ప్రయత్నించింది. బల్గేరియా ప్రభుత్వవర్గం నిరాకరించింది ! 1941 ఫిబ్రవరిలో హిట్లర్ బల్గేరియాను ఆక్రమించాడు. అక్టోబరులోనే ఇటలీ గ్రీస్ మీద దాడి ప్రారంభించింది.

బల్గేరియాను ఆక్రమించేపూర్వమే యుగోస్లావియాలో జర్మన్ ఏజెంట్లు తీవ్రంగా కుట్రలుచేస్తూ వచ్చారు. గ్రీస్ మీద దండయాత్రసాగిస్తే యుగోస్లావియా తటస్థంగా ఉండటానికి ప్లానులువేశారు. సర్బియన్లకు, క్రోట్లకు మధ్య జాతివైషమ్యాలను పురికొల్పారు. యుగోస్లావియా జర్మనులకు లొంగిపోతే అల్బేనియాను ఉచితంగా యుగోస్లావియా ప్రజలకు ఇచ్చివేస్తామని పుకార్లు పుట్టించారు. వీటన్నిటికితోడు 41 ఫిబ్రవరి 14 వ తేదీన యుగోస్లావియా ప్రధానమంత్రి, విదేశాంగ మంత్రులతో హిట్లర్ తన క్యాంపుస్థలమైన బెర్‌స్టెస్‌గార్డెన్‌లో సంప్రదించాడు ! మార్చి 25 వ తేదీన యుగోస్లావ్ మంత్రులు జర్మనీతో వియన్నాలో ఒడంబడిక చేసుకున్నారు !! ద్రోహం !! దేశద్రోహులకు వ్యతిరేకంగా, జర్మనీతో చేసుకున్న ఒడంబడికకు వ్యతిరేకంగా యుగోస్లావ్ ప్రజలు దేశవ్యాపిత తిరుగుబాట్లు చేశారు. మార్చి 27 వ తేదీన రాజుగా పనిచేస్తున్న 'పాల్'ను కూలద్రోశారు. సోవియట్ యూనియన్‌లో ఒడంబడిక చేసుకున్నారు. హిట్లర్ దురాక్రమణ ప్రమాదాన్ని గుర్తించి ప్రభుత్వాన్నికూలదోసి సోవియట్‌ప్రజలతో చేసుకొన్న మొదటి ఒడంబడిక ఇదే!

ప్రభుత్వ సభ్యులంతా పలాయనమయ్యారు. పీటర్‌రాజు (18 సంవత్సరాల వయస్సు) కొత్తప్రభుత్వాన్ని ఏర్పరిచాడు. ఈ నూతనప్రభుత్వానికి ప్రధానమంత్రి జెనరల్ సిమోవిచ్.

ఇప్పుడు హిట్లర్ ప్రమాదం యుగోస్లావియామీదికే వచ్చింది. హిట్లర్‌ను ఎదుర్కొనుటయా ? లేక రుమేనియా, బల్గేరియాలవలె లొంగిపోవుటయా ? యూరప్‌లో అప్పటికే చాలాభాగాన్ని ఆక్రమించుకుని విపరీతంగా బలపడిన హిట్లర్‌ముందు మిగిలిన బాల్కన్ దేశాలన్నీ (యుగోస్లావియా, గ్రీసు తప్ప) క్షణంలో లొంగిపోయినాయి. కాని యుగోస్లావియా ప్రజల సాంప్రదాయంవేరు. యుగోస్లావియా యువకులు 1936-38 మధ్య జరిగిన స్పెయిన్ ప్రజాపోరాటంలో ఫాసిస్టులకు వ్యతిరేకంగా హోరాహోరీ పోరాటాలు చేసివచ్చారు. సామ్రాజ్యవాదుల సహాయాన్ని ఎదురుచూడకుండా, ప్రభుత్వాన్ని కూలద్రోసి సోవియట్ యూనియన్‌తో ఒడంబడిక చేసుకున్న కొత్తరకం ప్రజలు యుగోస్లావియా ప్రజలు. చిరకాలపు జాతిభేదాలను మరిచారు. స్వాతంత్ర్యపోరాట సాంప్రదాయంగల ప్రజలంతా నడుముకట్టారు. హిట్లర్ దురాక్రమణను ఎదిరించి బ్రతికున్నంతవరకూ శత్రువుకు తల ఒగ్గకూడదని నిర్ణయించుకున్నారు. దేశంకొరకు, స్వాతంత్ర్యంకొరకు, తమ భావిజీవితంకొరకు అందరూ ఐక్యమయి వీరోచితపోరాటం సల్పుటకై సన్నాహమయ్యారు.

# స్వాతంత్ర్యమా లేక బానిసత్వమా

1941 ఏప్రియల్ 6 వ తేదీ తెల్లవారుఝామున మిడతల దళంలాగా ఉరికివచ్చి నాజీ విమానదళాలు బెల్‌గ్రేడ్ పట్టణంమీద బాంబులవర్షం కురిపించినాయి.

హిట్లర్‌దాడి ప్రారంభమయింది. ఈ యుద్ధకాలంలో హిట్లర్ సాగించిన ఘోర విమానదాడులలో ఇది ఒకటి.

నాజీ బెదిరింపులకు లొంగకుండా దేశరక్షణకు నడుముకట్టారు యుగోస్లావ్ ప్రజలు. ఈసంగతి హిట్లర్‌కు తెలుసు. హిట్లర్ అంతవరకూ ఇలాంటి ప్రజలను–ప్రాణమున్నంతవరకూ స్వాతంత్ర్యంకొరకు పోరాడే ప్రజలను — ఎదుర్కోలేదు. ఇది ఒక నూతన అనుభవం హిట్లర్‌కు. యుగోస్లావుల మనోనిబ్బరాన్ని నాశనంచేయాలని అతిఘోరమైన విమానదాడులను ప్రారంభించాడు హిట్లర్ !

ఇప్పుడు యుగోస్లావియాచుట్టూ శత్రువులే ఉన్నారు. ఉత్తరాన్నుంచి తూర్పు సరిహద్దులోఉన్న దేశాలన్నీ — హంగేరీ, రుమేనియా, బల్గేరియా — నాజీల స్వాధీనంలో ఉన్నాయి. పడమర అడ్రియాటిక్ సముద్రతీరాన్ని అనుకునిఉన్న ముఖ్య రేవుపట్టణాలైన స్ప్లిట్, దుబ్రోవ్‌నిక్ పట్టణాలకు ఇటాలియన్లనుంచి ప్రమాదంఏర్పడింది. పోతే దక్షిణాన గ్రీస్ ఇంకా జర్మనులవశం కానప్పటికి, బల్గేరియానుంచి అదేసమయంలో జర్మన్లు గ్రీస్ మీద ప్రారంభించిన దాడిఫలితంగా గ్రీసుగూడా శత్రువశమయితే దేశంచుట్టూ ఎటుచూసినా శత్రువులే ! ఈ పరిస్థితులలో యుగోస్లావ్ ప్రజలు ఏంచేశారు ?

యుగోస్లావ్ సైన్యాలన్నీ ఉత్తరానఉన్న క్రోషియా, స్లావోనియా మైదాన ప్రదేశాల్లో కేంద్రీకరించబడి యున్నాయి. ఈ సైన్యాలను వేరుచేస్తే యుగోస్లావియా లొంగిపోతుందని హిట్లర్, బల్గేరియాలోనుంచి నైరుతిదిక్కునుంచి యుగోస్లావియాలోకి, అదే సమయంలో బల్గేరియాలోనుంచి దక్షిణంగా గ్రీసులోకి నాజీసైన్యాలను నడిపాడు. విపరీత బలాలతో త్రోసుకునివచ్చి విరిగిపడుతున్న జర్మన్ సైన్యాలవ్యూహం జయప్రదమయింది. ఉత్తరానఉన్న యుగోస్లావ్ సైన్యాలు దక్షిణాన గ్రీస్‌లోచేరివున్న బ్రిటిష్ సైన్యాలనుంచి వేరు చేయబడినాయి.

వారంరోజులలో యుగోస్లావియాను ఆక్రమించినాయి జర్మన్‌సైన్యాలు. యుగోస్లావ్ ప్రభుత్వం, రాజుపీటర్, ప్రధాన మంత్రిఅయిన జెనరల్ సిమోవిచ్ దేశంనుంచి పలాయనమై లండన్‌కు ప్రయాణమైపోయారు ! అధికారం ఉన్నంతకాలం దేశంలో; దేశానికి ప్రమాదం వచ్చినపుడో ! ప్రభుత్వస్థానం బయట ఎక్కడో లండన్‌లో !

అయితే ప్రజలు ఎక్కడికిపోతారు? యుగోస్లావ్ ప్రజలంతా యుగోస్లావియాలోనే నిలబడ్డారు. ఇప్పుడు వారిని ఎదుర్కొన్న సమస్య. చావుబ్రతుకుల సమస్య. స్వాతంత్ర్యమా? లేక బానిసత్వమా? యుగోస్లావియా ప్రజలందరిని, దేశంలోఉన్న అన్ని జాతులను ఎదుర్కొంది ఈ ప్రశ్న.

వందల సంవత్సరాలపాటు సామ్రాజ్యవాదుల బానిసత్వం అనుభవించి, స్వాతంత్ర్యం కొరకు ఎడతెగని పోరాటంచేసి స్వేచ్ఛను సంపాదించుకున్న ప్రజలను మళ్ళీ ఎదుర్కొంది ఫాసిస్టులక్రింద బానిసత్వ ప్రశ్న. ఏమైనాసరే, నాజీలకు లొంగగూడదని నిర్ణయించు కున్నారు. ఫాసిస్టు సైన్యాలతో పోరాటం ప్రారంభమయింది.

విముక్తి వచ్చేవరకూ పోరాడాలంటే, బయటనుంచి సహాయంగూడా అవసరమే. బహిఃప్రపంచంతో సంబంధాలు పెట్టుకోవాలంటే యుగోస్లావియా ప్రజలకు అనాడు ఒకటేమార్గం ఉంది. ఆడ్రియాటిక్ సముద్రంగుండా, మధ్యధరా సముద్రంలోనుంచి ఇతర దేశాలతో సంబంధాలు పెట్టుకోవాలి. అంటే ఎట్టి పరిస్థితులలోనైనాసరే ఆడ్రియాటిక్ సముద్రతీరంలో కొన్ని స్థావరాలను ఏర్పరుచుకోవాలి. అక్కడనుంచి విదేశాల సహాయం కొరకు ప్రయత్నిస్తూ దేశంలో అన్ని ప్రాంతాల్లోనూ ఆక్రమితజర్మన్ బల్గేరియా సైన్యాలతో మాటుయుద్ధం (గెరిల్లా యుద్ధం) సాగించాలి. ఇదే యుగోస్లావ్ ప్రజల యుద్ధ వ్యూహం. హిట్లర్ దేశాన్ని ఆక్రమించిననాడే ఈవ్యూహం ప్రారంభమయింది. హిట్లర్ సైన్యాలకు యుగోస్లావ్ ప్రజలు ఎప్పుడూ లొంగలేదు॥

కాని 1939లో యుద్ధం ప్రారంభమయినప్పటినుంచి యూరపియన్ దేశాలన్నీ వశంగావించుకుని విపరీతంగా బలిష్టమైన నాజీసైన్యాలను ఎదుర్కోవటంఎలా? పట్టుదలతో చివరివరకూ యుద్ధం సాగించినా విజయం చేకూరుతుందా? ఈ సందేహాలలోపడి కాలం వ్యవధిచేస్తూ ఆలోచనలకు దిగలేదు యుగోస్లావ్ ప్రజలు. దేశభక్తి పూరితులైన యువజనులంతా, స్త్రీలు పురుషులు, వేలకువేలుగా యుగోస్లావియా రక్షణకేంద్రాలుగా ఉపయోగపడే కొండప్రాంతాల్లో ప్రవేశించారు. ఆయుధాలు, ఆహారపదార్థాలు లేకపోయినాసరే వాటిసంగతి తరువాత ఆలోచించవచ్చు. మొదట దేశభక్తులందరితో గూడిన దేశరక్షణ సైన్యాన్ని నిర్మించుటయే ప్రథమ కర్తవ్యం! శక్తివంతమైన గెరిల్లాసైన్యం ఉంటే ఆయుధాలు, ఆహారపదార్థాలు శత్రువునుంచే వశంచేసుకోవచ్చును. ఈ భావాలతో అన్ని ప్రాంతాలనుంచి — సర్బియా, మాంటినీగ్రో, బోస్నియా, స్లొవేనియా, హెర్జ్‌గోవినా, క్రోషియా, డాల్మేషియాలనుంచి వచ్చిన ప్రజా ప్రతినిధులందరూ గెరిల్లా సైనికదళాలలో చేరటం ప్రారంభించారు. పారిశ్రామిక కార్మికులు ఫ్యాక్టరీలను, యంత్రాలను వదిలిపెట్టి, దొరికిన ఆయుధాలనన్నిటిని తీసుకొని కొండలలో ప్రవేశించారు. రైతులందరూ తండోపతండాలుగావచ్చి గెరిల్లాసైన్యాలలోచేరారు. స్కూలుమాస్టర్లు, మాస్టర్లతోపాటు విద్యార్థులు, వైద్యులు, పత్రికావిలేఖరులు, ఇంజనీయర్లు, గుమాస్తాలు, ప్రముఖ రాజ్యాంగవేత్తలు,

పెద్దపెద్ద వ్యాపారస్థులు, పారిశ్రామిక ప్రతినిధులూ అందరూ వచ్చి గెరిల్లాదళాలలో చేరి పోయారు. ఫాసిస్టు దురాక్రమణదారులక్రింద బానిసగా ఉండడానికి సమ్మతించేవాడెవడు!

నిజమే, ప్రజాసామాన్యమంతా ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడాలని నిర్ణయించు కొని ముందుకు వచ్చింది. కాని ఫాసిస్టులక్రింద కీలుబొమ్మగా ఉండి వారి ఏజెంట్లుగా పని చేసే దేశద్రోహులు కొద్దిమంది యుగోస్లావియాలో గూడా హిట్లరుకు దొరికారు. ఈ ద్రోహులలో నెడిష్, పావెలిష్, రూష్నిక్ ముఖ్యమైనవారు. వీరి సహాయంతో హిట్లరు తన ఫాసిస్టుమిలటరీ పరిపాలనను ప్రవేశపెట్టాడు. త్వరలోనే ఈ ఇద్దరిద్రోహులను మించిన ద్రోహి మిహిలోవిచ్ గూడా హిట్లర్‌కు సహాయంగా లభించాడు. ఈ ద్రోహు లందరి మద్దతు ఉండబట్టే వారంరోజుల్లో హిట్లర్ సైన్యాలు దేశాన్ని ఆక్రమించుకో గల్గిన వనిగూడా మరిచిపోగూడదు. ఈ కీలుబొమ్మ ద్రోహులందరూ జర్మన్ బల్గేరియన్ సైన్యాల సహాయంతోనూ, సర్బియన్ విద్రోహకసైన్యమగు చెట్నికుల, 'ఉస్తాషీ' సైనికుల మద్దతుతోనూ యుగోస్లావియా ప్రజలమీద నిరంకుశపరిపాలనను రుద్దాలని సాహసించారు గెరిల్లాస్వాతంత్ర్యపోరాట సైన్యాలను ఎగుర్తున్నారు. యుగోస్లావియాప్రజల తిరుగుబాట్లను అణచుటకు బాధ్యతనంతా ఈ ద్రోహులమీద జర్మన్ సైనాధిపతులమీద వదిలేసి హిట్లరు తన ప్రపంచాధిపత్యప్లాను ప్రకారం ముందుకు సాగిపోయి 41 జూన్‌లో రష్యామీద పడ్డాడు. రెడ్ఆర్మీ సోవియట్ మంచుభూములలో నాజీసైన్యాలను పాతిపెట్టుతూంటే, యుగోస్లావి యాలో గెరిల్లాదళాలు హిట్లర్ ఆక్రమిత సైన్యాలను పురాతన బాస్నియా, డాల్మేషియా మాంటినీగ్రో కొండలలో ధ్వంసంచేయ మొదలుపెట్టారు.

ప్రారంభంలో గెరిల్లాదళాలు అనేకకష్టాలను ఎదుర్కోవలసివచ్చింది. చాలినంత ఆయుధసామగ్రి, పరికరాలు లేకపోయినాయి. యుగోస్లావ్ స్వాతంత్ర్య పోరాటశక్తులన్నీ ఇంకా ఐక్యంకాలేదు. వివిధప్రాంతాల్లో ఏర్పడిన స్థానికదళాల నన్నిటిని ఐక్యంచేయగల నాయకత్వం మొదట్లోలేదు. ఎవరికివారు వేరువేరుగా పోరాటం చేయవలసివచ్చింది. ఆధు నిక మారణయంత్రాలన్నీ పుష్కలంగాగల నాజీ సైనికదళాలముందు, ఈ గెరిల్లాదళాలు మొదట్లో లెక్కలోకిరావు. అయినప్పటికి జర్మన్ ఫాసిజంక్రిందక్రుగ్గి ప్రాణాలు అర్పించే బదులు, మొండి పట్టుదలతో గెరిల్లాదళాలు ముందుకు సాగిపోయినాయి.

యుగోస్లావియా స్వాతంత్ర్యపోరాట సైన్యాలను ఎదుర్కొనే ఈ 'చెట్నికులు' ఎవరు? హిట్లర్ సైన్యాలుకావు ఇవి. యుగోస్లావియా సైన్యాలుకావు. యుద్ధం ప్రారంభ మయేవరకూ 'బెల్‌గ్రేడ్' కేంద్ర ప్రభుత్వాన్ని బలపరచిన సర్బియన్ సైనికులే ఈ చెట్నికులు. 1918 వరకూ ఈ చెట్నికులు సర్బియన్ జాతీయపోరాట సైన్యంగా ఉపయోగపడ్డారు. తరువాత కాలక్రమేణా బెల్‌గ్రేడ్ సర్బియన్ నియంతృత్వ పరిపాలనను బలపరుచుటకు సహాయంచేస్తూ, యుగోస్లావియాలోని ప్రజాస్వామ్య శక్తులను, అల్ప సంఖ్యాకులైన ఇతరజాతులను అణిచివేయుటకు వినియోగించబడ్డారు. నేడు చెట్నికులు

జర్మన్ అదుపాజ్ఞలక్రింద పనిచేయుటకు ఈ విద్రోహకరసైన్యం తయారైందంటే ఆశ్చర్య మేముంది? గెరిల్లా సైన్యాలతో అనేకసార్లు పరాజయంపొంది జెనరల్ నెడిష్ రాజీనామా పెట్టవలసివచ్చినంతవరకూ, నెడిష్ నాయకత్వంక్రింద పనిచేశారు. అలాంటి సైన్యమే 'ఉస్తాషీ' గూడా.

ఈ విద్రోహక సైన్యాలను బలపరుచుటకు సర్బియన్ భూస్వాములు, జమీందార్లు తయారైనారు. అధిక సంఖ్యాకులుగాఉండి ఇతర జాతులను పీడించుటకు అలవాటుపడిన సర్బియన్ జమీందార్లు, నాజీసైన్యాలకు వ్యతిరేకంగా యుగోస్లావ్ ప్రజలు సాగించే పోరాటాన్నిచూసి భయపడ్డారు. ప్రజలను, వారి స్వాతంత్ర్య పోరాటాలను ఇంతకాలం నుంచీ అణచివేసిన సర్బియన్ జమీందార్లు హిట్లర్‌తో స్నేహాన్నైనా అంగీకరించారు గాని ఫాసిస్టు బానిసత్వానికి వ్యతిరేకంగా ప్రజలు ధైర్యసాహసాలతో సాగిస్తున్న పోరాటాన్ని బలపరచలేదు. పైగా ఈ స్వతంత్రశక్తులను అణచివేయుటకు సాహసించారు వీరు। దేశ స్వాతంత్ర్యశక్తులను నాశనంచేయటానికి ప్రయత్నించుటవల్ల వారి స్వాతంత్ర్యంగూడా క్రుంగిపోతోందని గుర్తించలేరు ఈ అస్తిపరులు।

గెరిల్లా సైన్యాలు స్వాతంత్ర్య వ్యతిరేక శక్తులన్నిటికీ వ్యతిరేకంగా యుద్ధం చేయవలసి వచ్చింది. సర్బియన్ జమీందార్లను, వారు ఉసిగొల్పుతున్న చెట్నికుక్కలను, జర్మన్‌సైన్యాలను ఎదుర్కొనటం ప్రారంభించారు. విపరీత బలంగల నాజీసైన్యాలను ఎదిరించటానికి నిర్ణయించుకున్న తరువాత, ఈస్వల్ప సర్బియన్ జమీందారీ శక్తి పెద్ద వ్యతిరేకశక్తియా? మొత్తంమీద త్వరలోనే స్వాతంత్ర్య పోరాటశక్తులు, విద్రోహక శక్తులు — రెండూ స్పష్టమయినాయి.

సోవియట్ యూనియన్‌మీద హిట్లర్‌దాడి ప్రారంభమయిన వెంటనే, సోవియట్ ప్రజల పట్టుదల, ధైర్యసాహసాలు ప్రకటితమయినాయి. హిట్లర్ ఆక్రమించిన సోవియట్ ప్రాంతంలోగూడా వెనుకనుంచి హిట్లర్‌సైన్యాలను నాశనం చేయుటకై సోవియట్ ప్రజలు గెరిల్లాయుద్ధం ప్రారంభించారు. సోవియట్ గెరిల్లాల అద్భుతచర్యలన్నీ యుగోస్లావ్ గెరిల్లాదళాలను ఉత్తేజపరుస్తున్నాయి. తూర్పుప్రాంతంలో స్లావ్‌ప్రజలైన రష్యన్లు, అజేయమని అంతవరకూ అందరూ అనుకున్న నాజీసైన్యాలను ఎదుర్కొని నాశనం చేస్తూంటే, దక్షిణస్లావు ప్రజలైన సర్బియన్, మాంటినెగ్రిన్, స్లొవనీస్ మొదలైన యుగోస్లావ్ ప్రజలందరికి ఉత్సాహం కల్గింది. రష్యాలో సోవియట్‌ప్రజలు సాధిస్తున్న విజయాలలో తమ విముక్తి అంకురాలు కన్పించినాయి యుగోస్లావ్ ప్రజలకు. జర్మన్ ఫాసిస్టు బానిసత్వంనుంచి బయటపడాలంటే సోవియట్ ప్రజలవలె నిలబడి పట్టుదలతో యుద్ధాన్ని సాగిస్తూ వెనుకనుంచి హిట్లర్ సైన్యాలకు చావుదెబ్బలు కొట్టుట ఒకటే మార్గమని స్పష్టంగా గుర్తించారు. విముక్తి వచ్చేవరకూ ఎదురుచూస్తూ కూర్చొనక, విముక్తి సత్వరంగా రావాలంటే, సోవియట్ ప్రజలు, ఆక్రమిత యూరప్‌ప్రజలు సాగించే స్వాతంత్ర్య

పోరాటానికి సహాయంగా నిలబడాలి. పరస్పర ప్రజాసహాయంద్వారా అందరికీ విముక్తి రాగలదనే సత్యం బోధపడింది

గెరిల్లాదళాల దేశభక్తిపూరిత నిర్ణయాన్ని గ్రహించాలంటే, సర్బియాలో జర్మన్ కీలుబొమ్మ ప్రభుత్వ అధ్యక్షుడుగా నియమించబడిన జెనరల్ నెడిష్‌కు సర్బియన్ గెరిల్లాలు బహిరంగంగా పంపిన జాబుచూస్తే తెలుస్తుంది :

"దేశానికి ఏర్పడిన అతిక్లిష్ట పరిస్థితులలో, దేశాన్నే అమ్మటానికి తయారైన నీచుడు నీకంటె ఎవడూ ఉండబోడు. ద్రోహులందరికీ పట్టేగతే నీకుగూడా తప్పదనే విషయం నీవు రూఢిచేసుకోవచ్చు. ప్రతి స్లావ్‌పౌరుడూ నిన్ను ద్రోహిఅని పిలువకతప్పదు. నీ బెర్లిన్ యజమానులకు గట్టిగా చెప్పు. బహిరంగంగాగాని. దొంగఎత్తులతోగాని నీబోటి కొద్దిమంది ద్రోహులతో సర్బియన్ ప్రజలను అణచాలంటే హిట్లర్‌కు సాధ్యం కాదు. హిట్లర్ బానిసత్వానికి వ్యతిరేకంగా స్లావ్‌ప్రజలనందరిని నడిపి స్వాతంత్ర్యం కొరకుపోరాడే ప్రభుత్వాన్నే సర్బియన్లందరూ బలపరుస్తారని నీ యజమానులతో చెప్పు."

ఈవిధంగా సర్బియన్ ప్రజలంతా యుగోస్లావ్ స్వాతంత్ర్య పోరాటంలోకివస్తూ గెరిల్లాదళాలను బలపరిచారు. సర్బియన్లేకాదు. యుగోస్లావియాలోని జాతులన్నీ గెరిల్లాదళాలను బలపరిచేసరికి అపూర్వ జాతీయైక్యతా ఉద్యమం వృద్ధి అవటం ప్రారంభమయింది. జాతీయైక్యతా ఆయుధంతో శత్రుసైన్యాలను ఎదుర్కొన్నారు.

యుగోస్లావ్ ప్రజల స్వాతంత్ర్యపోరాటం బాల్కన్‌దేశాల ప్రజలందరిని ఉత్తేజపరిచింది. గ్రీసు, అల్బేనియా, మాసిడోనియా ప్రజలుగూడా గెరిల్లా పోరాట పద్ధతులను అనుకరించటం ప్రారంభించారు బాల్కన్ ప్రజలేకాదు, హిట్లర్ దురాక్రమణ ప్రారంభమయినతరువాత యూరప్‌లో హిట్లర్‌ను ఎదిరించిన స్వాతంత్ర్యపోరాటం యుగోస్లావులదే. సోవియట్ యూనియన్‌మీద ప్రారంభమయిన తరువాతగూడా యూరప్‌లో హిట్లర్‌సైన్యాలకు వెనుకనుంచి దెబ్బకొట్టుటలో అగ్రస్థానం వహించింది యుగోస్లావ్ ప్రజలే. అంటే సోవియట్‌ప్రజలకు సహాయపడే హిట్లర్ వ్యతిరేకరంగాన్ని తెరిచారు యుగోస్లావ్‌ప్రజలు. యుగోస్లావ్ గెరిల్లా పోరాటం సోవియట్‌ప్రజలకు సహాయపడుటయేగాక, స్వదేశ విముక్తికి, యూరపియన్ ప్రజలవిముక్తికి దారితీసింది. యూరప్‌లో హిట్లర్‌కు బల్లెపుపోటుగా తయారైంది యుగోస్లావ్‌పోరాటం. ఒక స్థితికివచ్చేసరికి హిట్లర్, తన ప్రముఖ సైన్యాధిపతియైన రోమెల్‌ను పంపాల్సివచ్చింది యుగోస్లావ్ పోరాటాన్ని అణచటానికి ! స్వాతంత్ర్యంకొరకు అన్నిటికీ తెగించిన యుగోస్లావ్ ప్రజలముందు రోమెల్‌గూడా చివరికి పరాజయం పొందాడు.

1941 జూలైనాటికి, అనగా హిట్లర్ అక్రమణతరువాత 4 నెలల్లో, 30 పట్టణాలు, కొన్నివందల గ్రామాలు గెరిల్లాల వశమయినాయి. ఈ స్థావరాలనుంచి క్రమేణా ఇతర ప్రాంతాలనుగూడా జర్మన్ల చేతులనుంచి విముక్తి గావించుటకు పూనుకున్నారు. విజయాలు సాధించినకొలదీ, గెరిల్లా పోరాటానికి మద్దతు ఎక్కువయింది. ఈవిధంగా యుగోస్లావ్ ప్రజల పవిత్ర స్వాతంత్ర్యపోరాటం ప్రారంభమయింది.

# శత్రువుకు చావుదెబ్బలుకొట్టే గెరిల్లాలు !!

"గెరిల్లాలు ఉన్నారు జాగ్రత్త !!"

హిట్లర్ ఆక్రమించిన ప్రాంతాలన్నిటిలో ఫాసిస్టుసైనికులను హెచ్చరించే ఈ నోటీసులు ఎక్కడచూసినా కన్పిస్తాయి, ఎవరు ఈ గెరిల్లాలు ?

శత్రువు ఆక్రమించిన ప్రాంతంలోనే ఉండి మాటుగా శత్రువును నాశనంచేసే సైనికుడే 'గెరిల్లా'.

నెపోలియన్ స్పెయిన్‌ను పూర్తిగా ఆక్రమించలేకపోవుటకు కారణం స్పానిష్ గెరిల్లాలే! 1812 లో నెపోలియన్ రష్యాను ఆక్రమించలేక పోవుటకుగూడా ఈ గెరిల్లా పోరాటమే కారణం. నేడు సోవియట్ యూనియన్‌లో ఆక్రమిత ప్రాంతంలో తందోపతండాలుగా ఉండి వెనుకనుంచి నాజీ సైనికులకు ఊపిరి ఆడనీయకుండాచేసి ధ్వంసం చేస్తూన్నది గూడా ఈ గెరిల్లాలే. ఆ గెరిల్లా పోరాటమే యుగోస్లావియాలో హిట్లర్‌సైన్యాల ప్రాణం తీయుటకు ప్రత్యక్షమయింది !

అయితే గెరిల్లాదళాలు ఎలా ఏర్పడతాయి ? ఎలా పనిచేస్తాయి ? శత్రువుతో పోరాడి అవసరమైతే ప్రాణాలు అర్పించటానికి తయారై శక్తివంతులైన ఆక్రమిత ప్రజలెవరైనా గెరిల్లాదళాలుగా ఏర్పడవచ్చును. రైతులు, కూలీలు, చేతిపనివారు, వడ్రంగులు, కమ్మరులు, మెకానిక్‌లు, టీచర్లు— ఒకరేమిటి అందరూ, అన్ని వృత్తులకు చెందినవారూ చేరారు యుగోస్లావియా గెరిల్లా దళాల్లో- స్త్రీలు, పిల్లలతోసహా! మాటు యుద్ధంలో స్త్రీలు, పిల్లలు అత్యంత సహాయకరంగా ఉంటారు.

కాని ఆయుధసామగ్రి, ఆహారపదార్థాలు లేకుండా గెరిల్లా దళాలు పనిచేయుట అసంభవం. అవిలేకుండా ఎవరైనా ఎంతకాలం యుద్ధం సాగిస్తారు ? అయితే ఈప్రధాన అవసరాలను గూడా శత్రువులనుంచే వశం చేసుకుంటాయి గెరిల్లాదళాలు. అవి ఏర్పరచుకుంటూ శత్రువుల ప్లానులనన్నిటినీ భగ్నంచేయటానికి వ్యూహాలుపన్నుతూ పనిచేస్తారు గెరిల్లాలు. శత్రు రైలుమార్గాలను, ఆయుధసామగ్రుల కేంద్రాలను, రవాణా మార్గాలను, శత్రుసైనికులను— ఇంతదేనికి, శత్రువుకు సహాయపడే ప్రతిదానిని ధ్వంసం చేస్తారు. విమానకేంద్రాలను, సైనికకేంద్రాలను, టాంకులను పేల్చివేస్తారు. కొంతమంది గెరిల్లాలు సైన్యాధిపతుల కేంద్రాలను పరిమార్చుటలో ప్రత్యేకప్రావీణ్యతను సంపాదించి, శత్రువు యొక్క జీవకేంద్రాలను నాశనంగావిస్తారు. ఈ విధంగా బాధలుపెట్టేవారు ప్రతిచోటా అహోరాత్రులూ పనిచేస్తుంటే "గెరిల్లాలు ఉన్నారు, జాగ్రత్త !!" అని హిట్లర్ తనసైని

నికి వైమానికులను తీసుకొనిపోతున్న మోటారు బస్సును పట్టపగలే బాంబులువేసి పేల్చి, దానిలోని శత్రు వైమానికులనందరిని చంపేశారు. జగ్రేబ్‌లో టెలిఫోన్ ఆఫీసులో యువక కమ్యూనిస్టులీగ్‌లో సభ్యురాలైన ఒక అమ్మాయి పనిచేస్తూ ఉండేది. రహస్యంగా ఒకపాడైన యంత్రాన్ని తీసుకువచ్చి ఆఫీసులో పెట్టింది. వార్తలు బయటికి పంపుదామన్నా, బయటినుంచివచ్చే వార్తలను గ్రహించాలన్నా జర్మన్ ఆఫీసర్లకు కష్టమైపోయింది. ఈ విధంగా వార్తలను స్తంభింపచేసి ఆ అమ్మాయి తప్పించుకొని కొండలలో దాగియున్న తన గెరిల్లా స్నేహితులను చేరుకుంది.

1941 ఆఖరికి, గెరిల్లా సైనికదళాలమధ్య ఐక్యత ఏర్పడింది. మొదట తమతమ రాష్ట్ర గెరిల్లా ఉద్యమాల నన్నిటిని స్థానికంగా సర్బియా, మాంటినీగ్రో, క్రోషియా, స్లావేనియాలలో ఐక్యపరచుకున్న తరువాత ఇతర రాష్ట్రాలతోగూడా సంబంధాలు ఏర్పరచుకున్నారు. ఇప్పుడు దేశవ్యాపిత గెరిల్లాపోరాటాన్ని నడిపే నాయకత్వం ఏర్పడింది. జనరల్ టిటో యుగోస్లావియా గెరిల్లాదళ సైన్యాధిపతి అయినాడు. టిటోకు సహాయకరంగా కేంద్ర సైన్యాధిపతుల కమిటీ, వాలంటీరుసైన్యం గూడా నిర్మించబడినాయి. ఈ విధంగా దేశవ్యాపిత నిర్మాణం వచ్చిన తరువాత, గెరిల్లాదళాల శక్తి హెచ్చింది. విజయాలు గూడా ఎక్కువైనాయి. గెరిల్లాదళాల పోరాటాల నన్నిటినీ నడిపే కేంద్రం ఏర్పడిన తరువాత ఫాసిస్టుసైన్యాలతో చేసే పోరాటాలు మరీ తీవ్రమైనాయి.

ఇటాలియన్ సైన్యంతోనూ, జర్మన్లతోనూ ధైర్యసాహసముతో ముందుండి పోరాడిన యువకులు గెరిల్లాదళాలకు నాయకులుగా నియమించబడ్డారు. విషమ పరీక్షలకు గురి అయి, పరీక్షకు నిలిచి అసమాన దేశభక్తిని నిరూపించిన ఈ గెరిల్లాదళ నాయకులంటే ప్రజలందరికీ గాఢనమ్మకం ఏర్పడింది. దేశరక్షణకు ప్రాణాలొడ్డుటకు తయారైన ఈ నాయకుల చేతుల్లో తమభవిష్యత్తు అంతా సురక్షితంగా ఉండగలదని నమ్మారు. అనేక ప్రజాస్వాతంత్ర్య పోరాటాల్లో పాల్గొని అనుభం కలిగినవారే గెరిల్లాదళ నాయకులుగా వచ్చుట తటస్థించింది. వీరిలో చాలామంది స్పెయిన్‌లో ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడినవారు. 1914–18 యుద్ధంలో జర్మనులతో పోరుసల్పిన రైతునాయకులుగూడా ఉన్నారు. యుగోస్లావియా మేధావులు, పారిశ్రామిక కార్మికులు గూడా కొంతమంది గెరిల్లాదళ నాయకులుగా నియమించబడ్డారు.

రోజులు గడిచినకొలదీ గెరిల్లాదళాలు సభ్యత్వం పెరిగిపోతోంది. సంఖ్యతోపాటు బలంగూడా వృద్ధి అయింది. 1941 ఆఖరుకు 1 లక్షమంది గెరిల్లాదళాల్లో సైనికులుగా చేరి ఫాసిస్టులకు వ్యతిరేకంగా నిలబడ్డారు. అప్పటికి జర్మన్ సైనికులకు తెలిసివచ్చింది. యుగోస్లావియా ఓడిపోయిందని భావించుట పొరపాటని జర్మన్ సైన్యాధిపతులు గ్రహించారు. మాటునుంచి తమసైనికులను సైన్యపరికరాలను నాశనంచేస్తున్న గెరిల్లాదళాలను ఎదుర్కోవాలంటే జర్మనులకు సులభమైనది కాదని స్పష్టమయింది. దేశాన్ని ఆక్రమిం

చిన సైన్యాలు సరిపోవని గ్రహించి, కొత్తసైన్యాలను, ఆయుధసామగ్రిని దింపటం ప్రారంభించారు. యుగోస్లావియా ప్రజలమీద యుద్ధం మళ్ళీ ప్రారంభమయింది. ఈ విధంగా తిరిగి ప్రారంభమయిన యుద్ధం నేటివరకూ పూర్తికాలేదు!

1941 అక్టోబర్ నవంబర్ నెలలలో గెరిల్లాలకు వ్యతిరేకంగా అనేక జర్మన్ సైనిక దళాలు యుద్ధం చేయటం మొదలుపెట్టినాయి. యుగోస్లోవియా ద్రోహులైన నెడిష్, పోవెలిష్, మిహిలోవిచ్ తమ స్వదేశ విద్రోహ సైనికులనిచ్చి జర్మన్ దళాలకు సహాయం చేశారు. ఈ స్వదేశసైనికులను సాధారణంగా గ్రామీణప్రాంతాలకు పంపేవారు. గెరిల్లాలకు సహాయం చేసేవారిని, సానుభూతి చూపేవారిని పరిమార్చాలని ఈ స్వదేశ సైనికుల ఆశయం! ఈప్రయత్నాలనన్నిటినీ ఎదుర్కొంటూ సర్బియా, మాంటినీగ్రో, క్రోషియా రాష్ట్రాలలో గెరిల్లాలు ఘోరమైన యుద్ధాలను చేశారు. కాని జర్మనులకు ఆయుధ సామగ్రి పుష్కలంగా ఉంది. ఆధునిక పరికరాలు ఉన్నాయి. అందువల్ల ఒక్కొక్కప్పుడు కొన్ని పట్టణాలను వదిలిపెట్టి గెరిల్లాలు తిరోగమనం చేయవలసి వచ్చేది. కాని ఈ పట్టణాలను స్వాధీనం చేసుకొనుటకు గూడా జర్మన్ సైనికులు అపార నష్టాన్ని పొందక తప్పలేదు. యుగోస్లావ్ ప్రజల రక్తాన్ని త్రాగటానికి వచ్చిన జర్మన్, ఇటాలియన్ ఫాసిస్టు సైనికుల రక్తం ప్రవహించింది యుగోస్లావ్ పట్టణాల్లో.

చలికాలం వచ్చింది. కొంత విరామం దొరుకుతుందిగదా అనుకున్నారు జర్మన్లు. పాపం, విశ్రాంతికొరకు ఫాసిస్టు సైనికులు తహతహలాడారు చాలాకాలం నుంచి! చలికాలంలో కొండప్రాంతాల్లో నిలబడి పోరాడే అనుభవం, శిక్షణలేదు జర్మన్ సైనికులకు. జర్మన్‌దాడుల తీవ్రత తగ్గింది. యుద్ధరంగాలనువదిలి చలికాచుకోటానికి ఇండ్లలో ప్రవేశించారు. జనసంఖ్య ఎక్కువగాఉండే పట్టణాల్లోచేరి విశ్రాంతి తీసుకుంటున్నారు. కాని గెరిల్లాదళాలు విశ్రాంతిఇస్తేగా! తమదేశాన్ని జర్మన్లు ఆక్రమించుకున్నంతకాలం యుగోస్లావ్ ప్రజలు ఎలా నిద్రపోగలరు? వెనుకనుంచి గెరిల్లాదాడులు ప్రారంభమయినాయి. చలికాచుకుంటూ ప్రాణాలను కాపాడుకుంటున్న జర్మన్ సైనికులను పట్టణాల్లోనుంచి బయటికితరిమారు. మంచులోనూ, చలిలోనూ జర్మన్ సైనికులనేకమంది హతమయ్యారు.

1941 డిసెంబర్‌నాటికి యుగోస్లావ్ గెరిల్లాదళాలకు నూతన ఉత్సాహం వచ్చింది. కారణం? మాస్కోదగ్గర హిట్లర్ సాగించిన వ్యూహం భగ్నమయింది. మాస్కోదగ్గర జర్మన్లు పరాజయం పొందారు. ఆ సమయంలో యుగోస్లావియాలోగూడా జర్మన్లను చావుదెబ్బలు కొడితే, శత్రువు త్వరగా నాశనమవుతాడు. సోవియట్ విజయాలు యుగోస్లావులను ఉత్తేజపూరితులను చేసినాయి మాస్కోకు చుట్టూఉన్న పట్టణాలు ఒకటి తరువాత ఒకటి — కలినిన్, కలూగా, మోజేయిస్క్......... రెడ్‌ఆర్మీ తిరిగి స్వాధీనం గావించుకుంటున్నప్పుడు, యుగోస్లావ్ దేశభక్తులుగూడా జర్మన్లను దునుమాడి కొత్తపట్టణాలను వశం చేసుకున్నారు. 1942 జనవరి ఫిబ్రవరి నెలలలో పెద్ద జర్మన్ సైనికదళాన్ని,

ఉస్తాషి, నెదిష్ నాయకత్వంక్రింద పనిచేస్తున్నదళాలను చిందరవందరచేసి నాశనం గావిం చారు గెరిల్లాలు. ఈ నాశనమైనసైనికులు సుమారు 5000 మంది ఉంటారు. బోస్నియాలో చెలరేగుతున్న తిరుగుబాట్లను అణిచివేసి శాంతిని నెలకొల్పాలనే ఉద్దేశ్యంతో వీరు పంప బడ్డారు. పాపం గెరిల్లా దళాలముందు వీరు పారిపోవలసివచ్చింది. కొంతమంది చంప బడ్డారు. ఎక్కువమంది ఖైదీలుగా పట్టుబడ్డారు. వారి దగ్గరఉన్న ఆయుధసామగ్రి అంతా గెరిల్లాదళాల వశమయింది !

1942 ప్రారంభంలో మాంటినీగ్రో గెరిల్లాలు బాగా విజృంభించారు. ఇటాలియన్లు మొదటలో ఆక్రమించిన అనేక ప్రాంతాలను తిరిగి స్వాధీనం చేసుకున్నారు. శత్రువుకు విమానాలు, టాంకులు, మోటార్లు, మరఫిరంగులు ఎన్నోఉన్నాయి. అయితేనేం ! ప్రజల సహకారం లేనప్పుడు ఈ యంత్రాలు ఏంచేస్తాయి ? ప్రజల సహకారంగల గెరిల్లాల ముందు ఇవన్నీ పనిచేయలేదు. పైగా ఈ ఆయుధసామగ్రి అంతా మాంటినీగ్రో గెరిల్లాల వశమయింది !

1942 ఏప్రియల్ రోజుల్లో జర్మనులు పూర్వంకంటె ఎక్కువగా సన్నాహమై దేశమంతా రెండోదాడిచేశారు. ఈసారి గెరిల్లాలను పూర్తిగా దెబ్బతీయాలనుకున్నారు. మరఫిరంగులు, తుపాకులు, టాంకులు, విమానాలు, ఇతర కొత్తకొత్త ఆధునిక మారణ యంత్రాలన్నీ దింపారు.

ఆయుధ సామగ్రికి తరుగులేకుండా చేసుకొని యుగోస్లావియాలో గెరిల్లా ఉద్య మాన్ని అంకురాలతోసహా నాశనంచేసి, గెరిల్లాల వశమయిన ప్రాంతాలను తిరిగి ఆక్ర మించాలని ఈసన్నాహమంతా ! యుగోస్లావియాలో హిట్లర్‌కు ఉపగ్రహంగా నియమించ బడిన జెనరల్ బాదర్ ఈదాడిని నడిపాడు. గెరిల్లాలు ఆక్రమించుకున్న జిల్లాలను ముట్ట డించి గెరిల్లా సైనికబలాన్నంతా రూపుమాపుటకు ప్రయత్నించారు. రెండువైపులా పోరాడే సైనికుల సంఖ్య పూర్వంకంటె పెరిగింది. మాంటినీగ్రో, హెర్జ్‌గోవినా, బాస్నియా ప్రాంతాల్లో కొన్నివారాల తరబడి రాత్రింబగళ్లూ పోరాటం జరిగింది. 'ఫోకా' అనే పట్టణాన్ని వశంగావించుకోవాలని జర్మనులు 1 నెలరోజులు ప్రయత్నించారు. ప్రయో జనం ? ఇంత శ్రమపడి పట్టుకుంటే, వెంటనే గెరిల్లాలు విరుచుకుపడి పట్టణాన్ని తిరిగి స్వాధీనం చేసుకొనేవారు. ఈవిధంగా ఆ నెలరోజులలో ఫోకాపట్టణం అనేకసార్లు చేతులు మారింది. గెరిల్లాలకంటె ఎన్నోరెట్లు ఎక్కువగా జర్మనులచేతుల్లో యుద్ధసామగ్రి ఉంది. తాత్కాలికంగా గెరిల్లాలు తప్పుకోవలసి వచ్చింది. వెనక్కితగ్గి కొండప్రాంతాలలో ప్రవే శించి, అక్కడి స్వదేశగ్రామవాసుల సహాయంతో మళ్ళీ జర్మనులను ఎదుర్కొటానికి తయారైవచ్చారు. ఈవిధంగా గెరిల్లాయుద్ధం ఎడతెగని యుద్ధంలా మారింది. గెరిల్లా ఉద్యమాన్ని రూపుమాపాలని జర్మనులుచేసిన విశ్వప్రయత్నాలన్నీ భగ్నమవుతున్నాయి.

అయితే పైకొండప్రాంతాల్లో తాత్కాలికంగా గెరిల్లాలు వెనక్కి తగ్గారంటే దేశ మంతటా ఇదేజరిగిందని కాదు. ఉదాహరణానికి స్లొవేకియాలో అదే సమయంలో గెరిల్లా దళాలు అనేక అద్భుతవిజయాలను సాధించినాయి. ఈ విధంగా ఒకప్రాంతంలో గెరిల్లాలు జర్మనులను వేటాడుతూ చావుదెబ్బలు కొడుతుంటే, తమ శక్తులన్నిటినీ ఏదో ఒకచోట కేంద్రీకరించాలంటే జర్మనులకు సాధ్యపడలేదు. జర్మన్ దళాలన్నీ చిందరవందరగా పనిచేయవలసి వచ్చింది. అదే గెరిల్లాయుద్ధ ఫలితం! ఈ కారణం వల్లనే యుగోస్లావ్ జాతీయ పోరాటాన్ని నాశనంచేయుటకు జర్మనులకు నేటివరకూ సాధ్యంకాలేదు.

ఆ సమయంలో స్లొవేనియా రాష్ట్రమంతా గెరిల్లా పోరాటాలతో రేగిపోయింది. స్లొవేనియా ముఖ్యపట్టణమైన లూబ్లియానాలోనూ, లూబ్లియానా రాష్ట్రంలోనూ, ట్రీస్టిజిల్లా లోనూ, కోసిలీ, గోరికా, దివాక్ పట్టణాల్లోనూ, ఆస్ట్రియాకు ప్రక్కనే ఉన్న జిల్లాలోనూ ఈ గెరిల్లా యుద్ధం ప్రచండంగా జరిగింది. ఆ ప్రాంతాలను ఆక్రమించుకుని స్థిరనివాసా లను ఏర్పాటుచుకున్న ఇటాలియన్లను ముందునుంచి గెరిల్లాలు చావబాదుతుంటే, వెనుక నుంచి దేశభక్తి పూరితులైన ప్రజలందరూ ఇటాలియన్లకు గోతులు తయారుచేశారు! 1942లో స్లొవనీస్ గెరిల్లాలు, తమ రాష్ట్రంలో ఎక్కువ భాగాన్ని తిరిగి వశంచేసుకో గల్గారు.

స్లొవేనియా రాష్ట్రంలో ప్రజలనందరిని– ఆక్రమిత ప్రాంతాలవారిని, విముక్తి పొందుతున్నవారిని – ఐక్యంచేసి స్వాతంత్ర్య పోరాటంలో ముందుకు నడుపుటకై ఒక "విముక్తిసంఘం" ఏర్పాటుచేయబడింది. జర్మన్, ఇటాలియన్ బానిసత్వాన్ని నిర్మూ లింపచేసి దేశాన్ని విముక్తిగావించుటకు ముందుకురికే దేశభక్తులందరూ ఈ "విముక్తి సంఘం" ద్వారా ఐక్యమవుతున్నారు.

1942 జూలై, ఆగస్టు వచ్చేసరికి గెల్లాదళాలు ఆడ్రియాటిక్ సముద్రతీరం పొడు గునా అనేక ముఖ్యపట్టణాలను పట్టుకున్నారు. ఈ విజయాలు అతిముఖ్యమైనవి. ఇవి గాకుండా బొసాన్స్కక్రాయినా, బాస్నియా, క్రోషియా, డాల్మేషియాలలో గూడా గొప్ప విజయాలు సాధించబడినాయి జర్మన్, ఇటాలియన్ సైనికులను వేలకువేలుగా హతం గావించి కాంజికా, క్రిసీవో, లుబుస్కీ, ప్రిజిడోర్, ప్రొజోర్, గోర్నజీవాహూఫ్, గ్లామక్, బొసాన్స్కి పెట్రోవస్క, బొసాన్స్క క్రూపా, దోబ్రిలిన్, బ్రాడ్, సాన్స్కీమూస్ట్ మొద లైన పట్టణాలను గెరిల్లాలు ఆక్రమించుకున్నారు.

ఆడ్రియాటిక్ సముద్రతీరం అతి కీలకమైన ప్రదేశం. ఈ సముద్రతీరాన్ని ఆక్ర మించగల్గితే, గెరిల్లాదళాలకు బయటనుంచి సహాయం రాగలదు. అందువల్ల ఎలాగైనా సరే ఆడ్రియాటిక్ తీరాన్ని గెరిల్లాల పరంచేయకుండా ఉండుటకై ఇటాలియన్ సైన్యాలు ప్రతి అంగుళానికి ఘోరయుద్ధంచేయ ప్రారంభించినాయి. ఒక సంవత్సరంపాటు ఆసముద్ర తీరాన స్థావరాల నేర్పరచుకొని అనుభవిస్తున్న ఇటాలియన్లను లేపడం ప్రారంభించారు

గెరిల్లాలు. 1932 అక్టోబరునాటికి అడ్రియాటిక్ సముద్రతీరాన అనేకపట్టణాలు, పల్లెలు గెరిల్లాల ఆక్రమణ క్రిందికి వచ్చినాయి. 1942 జూలై తరువాత సాగిన యుద్ధాలన్నీ పెద్దపెద్ద యుద్ధాలే.

అంచే సైన్యాలకు సైన్యాలను గెరిల్లా ప్రాంతాల మీదికి జర్మనులు పంపారు. గెరిల్లాలు కూడా పెద్ద సైన్యాలను తయారుచేసుకొని జర్మన్ సైన్యాలను ఎదుర్కొన్నారు. ఒక్కొక్క సమయంలో వేలసైనికులతో గూడిన గెరిల్లాసైన్యం జర్మన్లను ఎదుర్కొనేది. రోజు రోజుకి గెరిల్లాదళాలు పెరుగుతున్నప్పుడు, జర్మన్ సైన్యాలను జయప్రదంగా ఎదుర్కొనుటకు సాధ్యపడింది. ఉదాహరణానికి క్లియూక్ పట్టణాన్ని గెరిల్లాలు ముట్టడించినప్పుడు జర్మన్ సైన్యాలకు సైన్యాలు నాశనమయినాయి.

1942 అక్టోబర్‌లో ఇటాలియన్ సావామ్దళాన్ని నాశనంచేసి గెరిల్లాలు ఆ దళాధిపతుల కమిటీని ఖైదుచేశారు. ఒక్క జనరల్ మాజా మాత్రం తప్పించుకు పారిపోయాడు.

యుగోస్లావ్ గెరిల్లా విజయాలు జర్మనీ సరిహద్దులవరకూ వ్యాపించుటవల్ల, స్లొవేనియాలో నుంచి గెరిల్లా ఉద్యమం ఆస్ట్రియాలో ప్రవేశించింది ; ఆస్ట్రియాలో దక్షిణ రాష్ట్రాలైన కారిన్థియా, స్టిరియాలలో గెరిల్లాదళాలు తల ఎత్తినాయి ;

1942 జూలై తరువాత యుగోస్లావియా గెరిల్లా పోరాట పరిమాణం విపరీతంగా పెరుగుటవల్ల యుగోస్లావ్ సరిహద్దులకు ముస్సోలినీ స్వయంగా వచ్చి ఇటాలియన్ సైన్యాధిపతుల నందరినీ సమావేశపరచి పరిస్థితులన్నీ చర్చించి కొత్తప్లానులను నిర్ణయించాడు. ఒక్క క్రోషియారాష్ట్రంలో గెరిల్లాలను అణచుటకై ముగ్గురు సైన్యాధిపతులు నియమించబడ్డారు. టాంకులు, విమానాలు, మరఫిరంగులతో సన్నాహమయిన కొత్తసైన్యాలను దింపి యుగోస్లావియా స్వాతంత్ర్య పోరాటాన్ని నాశనం చేయాలని మళ్ళీ ఫాసిస్టు ప్రయత్నాలు ప్రారంభమయినాయి. ఎన్నిసార్లు ప్రయత్నం చేయడం ?

1942 సెప్టెంబర్ 1 వ తేదీనాటికి యుగోస్లావియాలో 17 ఇటాలియన్ సైన్యాలు, 4 జర్మన్ సైన్యాలు, 4 హంగేరియన్ సైన్యాలు, 7 బల్గేరియా సైన్యాలు— మొత్తం 32 శత్రుసైన్యాలు, గెరిల్లా దళాలకు వ్యతిరేకంగా సమీకరించబడినాయి.

ఇన్ని కొత్తసైన్యాలను దింపినా గెరిల్లా ఉద్యమాన్ని అణిచివేయుటకు జర్మనులకు శక్యంకాలేదు. పైగా కొత్తగా దిగుమతిచేస్తున్న యుద్ధసామగ్రిలో చాలాభాగం గెరిల్లాలకు వప్పచెప్పటం జరిగింది. అంతేకాని జర్మన్లు, ఇటాలియన్లు ఒక అడుగైనా ముందుకు వేయలేకపోయినారు.

1942 సెప్టెంబరునాటికి గెరిల్లాదళాల బలం బాగా వృద్ధిఅయింది. గెరిల్లా దళాలలో చేరిన యుగోస్లావ్ సైనికులసంఖ్య 3 లక్షలకు పెరిగింది. ఈ 3 లక్షలసైన్యం సెప్టెంబరునాటికి శత్రువులు ఆక్రమించిన ప్రాంతంలో దాదాపు మూడోవంతు భూభాగాన్ని గెరి

ల్లాలు తిరిగి ఆక్రమించారు. 1942 సంవత్సరాంతానికి 100 పట్టణాలు, కొన్నివేల గ్రామాలు గెరిల్లాల చేతుల్లోకి వచ్చినాయి. ఒక్క బోస్నియా, బొసాన్స్కా-క్రాజినా రాష్ట్రాల్లోనే 48000 చదరపు కిలోమీటర్ల వైశాల్యంగల ప్రాంతం గెరిల్లాల వశమయింది. క్రోషియా, మిల్మేషియా, స్లొవేనియా రాష్ట్రాలలో శత్రువులు వేలకువేలుగా మరణించారు.

జర్మనులపక్షాన పోరాడుటకు బల్గేరియన్ సైనికులుగూడా తీసుకొని రాబడ్డారని తెలుసుకున్నాం. అయితే, ఈ బల్గేరియన్ సైనికుల విషయంలో యుగోస్లావ్ గెరిల్లాల వైఖరి వేరుగాఉంది. ఇటాలియన్లను, జర్మనులను చంపివేయుటతప్ప మరొకమార్గంలేదు. ఎప్పటినుంచో యుగోస్లావియాను ఆక్రమించాలని జర్మనీ ఇటలీ ఫాసిస్టు ప్రభుత్వాలు వేచియున్నాయి. వారంటే యుగోస్లావ్ ప్రజాసామాన్యమంతా ఎప్పుడూ ద్వేషించింది. కాని ఈ బల్గేరియన్ సైనికులు హిట్లర్‌చే బలాత్కారంగా తీసుకురాబడ్డారు. తమ సోదర స్లావులను చంపుట న్యాయంకాదని, వారి తుపాకులను ఆయుధాలను యుగోస్లావులకు బల్గేరియన్లకు — ఇద్దరికీ శత్రువైన జర్మన్ ఫాసిజాన్ని నాశనం గావించుటకై ప్రయోగించవలెనని బల్గేరియన్ సైనికులలో గెరిల్లాలు ప్రచారంచేసేవారు. ఈప్రచార ఫలితంగా బల్గేరియన్ సైనికు లెంతమందోవచ్చి యుగోస్లావ్ గెరిల్లాలలో చేరారు! ఈనాడు బల్గేరియా — యుగోస్లావియా సరిహద్దులమీద జర్మన్ ఇటాలియన్ దురాక్రమణదారులతో పోరాడే బల్గేరియన్ గెరిల్లా సైన్యాలు చాలా తయారైనాయి.

1942 ఆఖరికి గెరిల్లా ఉద్యమం బలమైన దేశవ్యాపిత స్వాతంత్ర్య ఉద్యమంగా పరిణమించింది. స్వదేశవిముక్తికొరకు గెరిల్లాలు వహించేపాత్ర మహత్తరమైన జాతీయ ప్రాముఖ్యతను గాంచింది. శత్రువులనుంచి విముక్తిఅయిన జిల్లాలసంఖ్య పెరిగిపోయి అన్నిప్రాంతాల్లోని ప్రజలు గెరిల్లా ఉద్యమంలో పాల్గొంటూ ఉన్నందువల్ల గెరిల్లాఉద్యమం గొప్ప ప్రజాఉద్యమంగా తయారైంది. ఈ బ్రహ్మాండమైన ప్రజాస్వాతంత్ర్య పోరాటాన్ని జయప్రదంగా ఆఖరివరకూ సాగించుటకు ప్రజలందరూకలిసి ఎన్నుకొన్న ఒక జాతీయ కమిటీ అవసరమైంది. 1941 నవంబర్ 26, 27 తేదీలలో 'బీహచ్' అను పట్టణంలో (బొస్నియా రాష్ట్రంలో) అన్ని ప్రాంతాలనుంచి 53 గురు ప్రజాప్రతినిధులు సమావేశమయారు. ఒక ప్రజా పరిషత్తును ఎన్నుకున్నారు. ఈ సంఘానికి ఇవాన్ రిబార్ అధ్యక్షుడు. రిబార్ యుగోస్లావియా ప్రముఖ రాజకీయ నాయకులలో ఒకరు. రిబార్‌ది న్యాయవాద వృత్తి. క్రోషియా, జాకోవ్ పట్టణాల్లో అతనికి ప్రాక్టీస్ ఉండేది 1920 లో ఏర్పాటు చేయబడిన యుగోస్లావ్ ప్రజాపరిషత్తుకు రిబార్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు.

కొత్తగా ఎన్నుకోబడ్డ ఈ ప్రజాపరిషత్తు తరపున వెంటనే స్టాలిన్‌గ్రాడ్ వీరులకు; సోవియట్ సైన్యాలను నడుపుతున్న స్టాలిన్, రూజువెల్టు, చర్చిల్ మొదలైన మిత్రమండలి నాయకులకు అభివందనాలు తెలియజేయబడినాయి.

యుగోస్లావ్ గెరిల్లా ఉద్యమాన్ని ఇప్పుడు బయట ప్రపంచం గుర్తించే సమయం వచ్చింది. అంతవరకూ జర్మన్ సైన్యాలను చావుదెబ్బలు కొడుతున్న గెరిల్లాల ప్రతాపం హిట్లర్ ఆక్రమించిన యూరపియన్ దేశాలన్నిటికి వ్యాపించింది. హిట్లర్‌కు ఆవేశం ఎక్కువయింది. ఇప్పుడు ఉత్తర ఆఫ్రికాలో అమెరికన్ బ్రిటిష్‌సైన్యాలు దిగి రోమెల్ సేనాని పరాజయం పొందినతరువాత, హిట్లర్‌కు యుగోస్లావియా గెరిల్లాఉద్యమం పక్కలో బల్లెంలా తయారైంది ఉత్తరాఫ్రికాలో పోరాడుతున్న మిత్రమండలి సైన్యాలకు యుగో స్లావ్ గెరిల్లాలు అత్యంత సహాయకరంగా నిలబడ్డారు. యుగోస్లావియాలోనే దాదాపు 20 జర్మన్ ఇటాలియన్ సైన్యాలను గెరిల్లాలకు వ్యతిరేకంగా హిట్లర్ నియమించవలసి వచ్చింది. ఉత్తరాఫ్రికాలో మిత్రమండలి సైన్యాలకు వ్యతిరేకంగా ఉపయోగపడగల వేల మంది ఫాసిస్టుమూకను యుగోస్లావ్ గెరిల్లాలు చిత్రవధ గావించటం హిట్లర్ సహించలేక పోయాడు. అంతేకాదు. ఆడ్రియాటిక్ సముద్రతీరం ద్వారా. ఉత్తరాఫ్రికాకు కొత్త సైన్యా లను పంపాలని హిట్లర్ ప్రయత్నించినపుడల్లా యుగోస్లావ్ గెరిల్లాలు రహదారీ మార్గా లలో కాచి వారిమీద దెబ్బకొట్టేవారు. ఈవిధంగా గెరిల్లాబాధ హిట్లర్‌కు పెద్ద లెక్కించ తగిన శత్రువుగా పరిణమించింది. ఇక యూరప్‌లో రెండోరంగం తెరిచిన తరువాత, యుగోస్లావ్ గెరిల్లాల ప్రతాపం చూడాలి !

ఈ పరిస్థితులన్నీ గుర్తించిన హిట్లర్ ఎలాగైనాసరే ఈమాటు గెరిల్లాసైన్యాన్ని రూపుమాపాలనుకున్నాడు. 1943 జనవరిలో గెరిల్లాలకు వ్యతిరేకంగా 4 వ దాడిని ప్రారం చారు ఫాసిస్టులు. పూర్వకంటె ఎక్కువ మారణయంత్రాలను సమీకరించారు. 1943 మార్చినాటికి 7 జర్మన్‌సైన్యాలు, 6 ఇటాలియన్ సైన్యాలు. ఇవిగాకుండా దేశంలోని ద్రోహులైన మిహిలోవిచ్, పావెలిచ్ సైన్యాలు అన్నీకలిసి గెరిల్లాలు ఆక్రమించిన ప్రాంతాలమీద దాడిచేశాయి. బిహక్, పెట్రోవల్, ప్రోజార్, బుగోనో, గోర్నిజీవాకుఫ్, కొంజికా పట్టణాలమీద, సారాజీనో—మోస్టార్‌ల మధ్య, నెరిట్వానదీ ప్రాంతంలోనూ భయంకర యుద్ధాలు జరిగినాయి. కొన్నిరంగాలలో కొన్నివేల శత్రుసైనికులను గెరిల్లాలు నాశనం చేశారు. ఒక్క మజ్కాకాప్రీ అను గ్రామ సమీపంలో 1500 మంది శత్రుసైనికు లను గెరిల్లాలు ఖైదీలుగ పట్టుకున్నారు. మరీ దుర్భరమైనప్పుడు, కొన్ని రంగాల్లో గెరి ల్లాలు కొంచెం వెనక్కి తగ్గారు. కాని అవకాశం కాస్తదొరికినాసరే గెరిల్లాలు తిరుగుదా డులు సాగించి శత్రువును వేటాడారు. ఆ విధంగా ప్రోజార్ పట్టణాన్ని ముట్టడించి స్వాధీనం చేసుకున్నారు గెరిల్లాలు. ఈ ‘ప్రోజార్’ పట్టణం ఒక ముఖ్యశత్రుకేంద్రం. ఈ కేంద్రం యుగోస్లావుల వశమయింది. ఈ 4 వ దాడిలో 1150 మంది ఇటాలియన్ ఆఫీసర్లు, సైనికులు మరణించారు. జర్మన్లెంతమంది చనిపోయిందీ సరియైన లెక్కలు లేవు. ఇక గెరిల్లాలచే చిక్కిన యుద్ధసామగ్రికి అంతులేదు.

'ప్రోజార్' ను వశంగావించుకున్న తరువాత గెరిల్లాలు ముందుకు సాగిపోయి మోస్టార్-సారాజీవో రైలుమార్గం పొడుగూనా దాడులుచేశారు. ఈ రైలుమార్గం ద్వారానే జర్మనులు అడ్రియాటిక్ తీరంచేరి అక్కడినుంచి ఉత్తరాఫ్రికాకు పంపబడేది. ఈ దాడిలో 100 కిలోమీటర్ల రైలుమార్గాన్ని గెరిల్లాలు ధ్వంసంచేశారు. శత్రుకేంద్రాలమధ్య రాకపోక మార్గాలను నాశనంచేశారు. మోస్టార్-ప్రొజార్-కాంజికా రంగంలో "మర్జ్" అను ఇటాలియన్ సైన్యం పూర్తిగా ధ్వంసం చేయబడింది. ఈ సైన్యంలో చనిపోయినవారి సంఖ్య 2000 మంది సైనికులు, 45 మంది ఆఫీసర్లు. 25 మంది ఆఫీసర్లను, 1200 మంది సైనికులను ఖైదీలుగా పట్టుకున్నారు. | వీరుగాకుండా 350 మంది జర్మనులు చంపబడ్డారు. ఈ రంగంనుంచి పారిపోతూ తొందరలో 17 టాంకులను, 16 మరఫిరంగులను, 230 మెషిన్-తుపాకులను, 20 లక్షల తూటాలను, ఇ. కా ఇతర యుద్ధసామగ్రిని గెరిల్లాలకు వదిలి వేయవలసి వచ్చింది.

ఇంతకంటె గొప్ప విజయాలను గోర్నిజీ — వాకూఫ్ — బుగోనో రంగంలో గెరిల్లాలు సాధించారు. ఇక్కడ 8 రోజులు వరుసగా 2 జర్మన్ డివిజన్లను, 'ఉస్తాషీ' దళాలను ఎదుర్కొని, తరువాత తిరుగుదాడులుచేసి శత్రువును పూర్తిగా చిందరవందర గావించి నాశనంచేశారు. 718 వ జర్మన్ డివిజన్, 36 వ జర్మన్ డివిజన్ రూపంలేకుండా పోయినాయి. ఒక్క యుద్ధంలోనే జర్మన్లు 8,0 మంది చంపబడ్డారు. గాయపడినవారు గాని, ఖైదీలుగా చిక్కినవారుగాని కొన్నివేలమంది ఉంటారు. 'లిచ్' రంగంలో 1600 మంది సైనికులను, ఆఫీసర్లను గెరిల్లాలు నాశనంచేశారు. ఈవిధంగా గెరిల్లాదాడులు బాహుళ్యంగా జరిగినాయి. తరువాత ఇమోట్స్కి అను పట్టణాన్నిగూడా స్వాధీనం చేసుకొని, అది కేంద్రంగా పెట్టుకొని గెరిల్లాలు ఇమోట్స్కి-లూబుస్కి-అడ్రియాటిక్ తీరం మధ్య త్రికోణప్రాంతాన్ని వశంచేసుకున్నారు.

స్లొవేనియాలోని గెరిల్లాలు విరామంలేకుండా ఇటాలియన్ శత్రుసైనికులను నాశనం గావించారు.

1943 జూలై 23 వ తేదీన ముస్సోలినీ పతనమైన తరువాత, యుగోస్లావియాలోని ఇటాలియన్ సైనికులు వేలకువేలుగా జర్మన్‌దళాలను వదిలిపెట్టి యుగోస్లావ్ గెరిల్లా దళాల్లో చేరారు. యుగోస్లావ్ గెరిల్లాఉద్యమం బ్రహ్మాండమైన ఫాసిస్టువ్యతిరేక ఉద్యమంగా తయారైంది.

గెరిల్లాయుద్ధం తీవ్రమయినకొలదీ, హిట్లర్, కొత్తకొత్త సైన్యాలను యుగోస్లావియాలో దింపటమే గాకుండా యుగోస్లావియా జాతీయ ఉద్యమాన్ని విచ్ఛిన్నంచేయుటకై నాజీ ఏజెంట్లు కొత్తఎత్తులు వేశారు. గెరిల్లా ఉద్యమంమీద అనేకనిందలు కల్పించారు. అబద్ధప్రచారం ప్రారంభించారు. గెరిల్లాదళాలన్నీ కమ్యూనిస్టుదళాలని, గెరిల్లా ఉద్యమం యుగోస్లావియాలో కమ్యూనిజాన్ని స్థాపించుటకు ప్రయత్నిస్తోందని, కమ్యూనిస్టుల

నాయకత్వంక్రింద నడుపబడుతోందని గోబెల్స్ సర్వసాధారణ ప్రచారం యుగోస్లావీయాలో గూడా ప్రారంభించారు నాజీ ఏజెంట్లు. ఈవిధంగా యుగోస్లానియా ఆస్తిపరుల నందరిని బెదిరించి గెరిల్లా స్వాతంత్ర్య పోరాటానికి వ్యతిరేకంగా త్రిప్పాలని ఈద్రోహుల ఆశయం.

ఈ అబద్ధప్రచారాన్ని బట్టబయలు చేయుటకై యుగోస్లావియా ప్రజాపరిషత్తు, గెరిల్లాదళ సర్వసేనాధిపతులు కలిసి ఒక స్టేటుమెంటు ఇచ్చారు. "యుగోస్లోవియాలోని దేశభక్తులందరియొక్క ప్రధాన ఉద్దేశ్యం ఒక్కటే ఈనాడు. దేశాన్ని ఆక్రమించిన దురాక్రమణదారులను నాశనంగావించి యుగోస్లావియా స్వాతంత్ర్యాన్ని తిరిగి స్థాపించుటయే మా ఆశయం. ఈఆశయాన్ని నెరవేర్చుటకుముందు మిగిలిన విషయాలన్నీ ప్రాధాన్యత వహించవు. యుగోస్లావియా స్వాతంత్ర్యమే నేటి ప్రధాన ఆశయం. దేశంలో నుంచి శత్రువును తరిమివేసిన తరువాత, దేశంలోని సాంఘిక రాజకీయ సమస్యలన్నిటినీ ప్రజలందరిచే స్వేచ్ఛగా ఎన్నుకొనబడిన ప్రతినిధులే పరిష్కరిస్తారు."

ప్రజాపరిషత్తు తరపున రిబార్, గెరిల్లా సైన్యాల తరపున జనరల్ టిటో ఇచ్చిన స్టేట్‌మెంటులో ఇంకా ఈదిగువవిధంగా చెప్పబడింది ;-

"గెరిల్లాయుద్ధం ప్రారంభమయినప్పటినుంచి, విముక్తిగావించిన ప్రాంతాల్లోగాని, ఇరత ప్రాంతాల్లోగాని గెరిల్లాదళాలు, ఎవరిసొంత ఆస్తుల భద్రతకు భంగం కల్గించగూడదనే సిద్ధాంతాన్ని అక్షరాలపాటించారు. సొంతవ్యాపారాన్ని, సొంత పరిశ్రమలను ఎక్కడా నిరోధించలేదు. విముక్తిగావించిన ప్రాంతాల్లోగూడా సాంఘిక జీవితంలోగాని, రాజ్యాంగ వ్యవహారాల్లోగాని ఎట్టి తీవ్రమైన మార్పులను ప్రవేశపెట్టలేదు. ఎక్కడైనాసరే, జర్మన్ దురాక్రమణదారులను పరిమార్చాలని ముందుకు వచ్చిన ప్రజాప్రతినిధుల నందరిని - వారు ఎవరైనాసరే - గెరిల్లాదళాలు బలపరచినాయి. సైన్యంవిషయంలోగాని, ప్రజలవిషయంలోగాని గెరిల్లాదళాలు ఎట్టి బలాత్కార పద్ధతులను అనుసరించలేదు. ఎప్పుడూ వారిబుద్ధిపూర్వక సహకారంమీదనే ఆధారపడ్డారు."

"యుగోస్లోవియా జాతీయవిముక్తి పోరాటం విజయవంతం కావాలంటే, యుగోస్లావియాలోని వివిధ జాతులకు చెందిన వారందరియొక్క స్వయంనిర్ణయహక్కులను గుర్తించుట అవసరం. క్రోషియా, సర్బియా, స్లొవేనియా జాతుల స్వయంనిర్ణయహక్కును గుర్తించుట మన ప్రథమకర్తవ్యం. ఇప్పుడే జర్మన్ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా వీరందరూ కలిసి స్వాతంత్ర్యంకొరకు సోదరులవలె భుజంభుజం కలిపి పోరాడుతున్నారు. వారి స్వయంనిర్ణయహక్కును గుర్తించిన యెడల, ఈ స్వాతంత్ర్యయుద్ధకాలంలో నిర్మించబడుతున్న జాతీయైక్యత శాశ్వత సోదర సౌభ్రాతృత్వానికి దారితీయగలదు" అని స్టేట్‌మెంటు చాటుతోంది.

గెరిల్లా యుద్ధాశయాలను ఇంత స్పష్టంగా ప్రకటించిన తరువాత, యుగోస్లావ్ ప్రజలు గెరిల్లాదళాలను ఇంకా ఎక్కువగా బలపరిచారు.

యుగోస్లావియా స్వాతంత్ర్యాన్ని జర్మన్ ఫాసిస్టులు మంటకలపాలని చూస్తున్నారు. తమ స్వాతంత్ర్యాన్ని తిరిగి స్థాపించుకోవాలని యుగోస్లావియా ప్రజలు ఆరాటపడు తున్నారు. గెరిల్లాదళాలు ఈ స్వాతంత్ర్యపోరాట దళాలే. అనేక దుర్భర కష్టాలకోర్చి గెరిల్లాలు ఈపోరాటాన్ని సాగిస్తున్నారు.

అన్ని కష్టాలలోకి పెద్దది ఆయుధాల కొరత. ఇంతవరకూ శత్రువులను నాశనం గావించి సంపాదించుకున్న ఆయుధాలతోనే గెరిల్లాలు శత్రువును దెబ్బకొడుతున్నారు. గెరిల్లాలకు ప్రతి తోటా ఒక అమూల్యమైన వస్తువు. ఆయుధాలను సప్లయిచేయాలని గెరిల్లా దళనాయకులు రాత్రింబగళ్ళూ విశ్వప్రయత్నాలు చేస్తారు. గెరిల్లా దళనాయకులకు ఆయుధ సామగ్రి సప్లయి అన్నిటికంటె పెద్ద సమస్య.

రెండోకష్టం - ఆహారసప్లయి. యూగోస్లావియా పంటనంతా కొల్లగొట్టి నాజీ సైన్యాధిపతులు జర్మనీకి పంపిస్తున్నారు గెరిల్లా ధాటికి ఓర్వలేక తిరోగమనం చేయవలసి వచ్చినప్పుడు దారిలోని గ్రామాలను తగలబెట్టి జర్మనులు ఆప్రాంతంలోని ప్రజలను గూడా తిండిలేకుండా చేస్తున్నారు. అటువంటి పరిస్థితులలో తమవద్ద మిగిలియున్న కొద్ది పాటి ఆహారపదార్థాలను గెరిల్లాలు ఆప్రాంతంలోని ప్రజలకుగూడా పంచిపెడతారు. దేశంలో ఏర్పడిన క్లిష్టపరిస్థితులలో ఒకప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి ఆహారపదార్థాలు సరఫరా చేయుట అపాయకరమైన విషయం. ఈ కారణాలవల్ల ఆయుధాలనేగాక, ఆహార పదార్థాలనుగూడా శత్రువునుంచే స్వాధీనంచేసుకొనవలసివచ్చింది!

జర్మనులు ఆక్రమించిన ప్రాంతాల్లో జరుగుతున్నవిషయం. అక్కడి ధాన్యాన్ని కొల్లగొట్ట జర్మనులు ప్రయత్నించారు. పంటబాగా పండి కోతకువచ్చేసమయానికి, నూర్పే యంత్రాలన్నిటిని రైతులు నాశనంచేశారు. అందువల్ల జర్మనీకి ధాన్యపు ఎగుమతి ఆగిపో వలసి వచ్చింది. రైతులు నూర్చుకోవాలంటే ఏవో చిన్న చిన్న సాధనాలను ఉపయోగించారు!

ఆయుధసామగ్రి, ఆహారపదార్థాల కొరత అలాఉంచి, యుగోస్లావ్ దేశభక్తుల నందరిని మరొక రాజకీయ సమస్య ఎదుర్కొంది జర్మనులు దేశాన్ని ఆక్రమించినతరు వాత కొన్ని కీలుబొమ్మ ఏజెంట్ల ప్రభుత్వాలను స్థాపించారు. సర్వియాలో నెడిక్ ప్రభుత్వం; క్రోషియాలో పావెలిష్, నాజీ ఏజెంట్లుగా ఉండి పరిపాలనకు బాధ్యతవహించే ద్రోహానికి సిద్ధపడ్డారు. మొదట్లో జర్మనులు యుగోస్లావియా మీద దాడి ప్రారంభించినప్పుడు ఈ ద్రోహులుగూడా జర్మనులకు వ్యతిరేకంగా నిలబడ్డారు. ఆసమయంలో యుగోస్లావియా సైన్యాలు కొన్ని వీరి నాయకత్వంక్రింద జర్మనులను ఎదుర్కొన్నాయి. కాని త్వరలోనే యుగోస్లావియా గెరిల్లా ఉద్యమం బ్రహ్మాండమైన ప్రజాఉద్యమంగా తయారవటంచూసి

ఈ సైన్యాధిపతులకు భయం పుట్టింది. మొదట్లో రహస్యంగానూ, తరువాత బహిరంగం గానూ ఈ ద్రోహులు రోజురోజుకు వృద్ధిఅవుతున్న గెరిల్లా ఉద్యమాన్ని వ్యతిరేకించారు. చివరికి గెరిల్లా ఉద్యమంలోనుంచి తప్పుకొని, వేరే దళాలను నిర్మించుకున్నారు. జాతీయ విముక్తి పోరాటాన్ని ఎలాగైనాసరే విచ్ఛిన్నం చేయుటకు ఎదురు చూస్తున్న జర్మనులకు మంచి అవకాశం దొరికింది. గెరిల్లా స్వాతంత్ర్యపోరాటదళాలకు భయపడి విడిపోయిన నెదిష్, పావెలిష్‌లకు ఆయుధసామగ్రిని సప్లయిచేసి జర్మనులు వారిని గెరిల్లాదళాలమీదికి ఉసిగొల్పారు. ఈద్రోహులు జర్మన్, ఇటాలియన్ దళాలతోకలిసిపోయి తమ స్వదేశస్థుల స్వాతంత్ర్య ఉద్యమాన్నే ఎదుర్కొన్నారు. వీరి చర్యలను యుగోస్లావియా స్వాతంత్ర్యం కోరేవారందరూ గర్హిస్తున్నారు. యుగోస్లావియా ప్రజాపరిషత్తు వీరిని తీవ్రంగాఖండించింది.

పై విషయాలను బట్టి యుగోస్లావియా జాతీయ స్వాతంత్ర్య పోరాటం దేశవ్యాపిత పోరాటమని స్పష్టపడుతోంది. జర్మనులు దేశంలో ప్రవేశించినప్పుడు సరియైన నిర్మాణం గూడా లేకుండా బయలుదేరిన చినచిన్న దళాలు నేడు 2 సంవత్సరాల కాలంలో దేశవ్యాపిత నిర్మాణంకల్గి బలమైన శత్రువును ముందునుంచి వెనుకనుంచి ఎదుర్కొంటున్నాయి. యుగోస్లావియాలోని వివిధజాతుల మధ్య వైషమ్యాలను పురికొల్పాలని జర్మనులు ప్రయత్నించారు. ఉదాహరణానికి, సర్బియా ప్రజలమీద యుద్ధం సాగించడానికి క్రోషియాను, క్రోషియా ప్రజా ఉద్యమాన్ని నాశనం గావించుటకు ఇతరప్రాంతాలను ఉపయోగించాలని జర్మనులు విశ్వప్రయత్నాలుచేశారు. కాని జర్మనులు ఎక్కడ ప్రవేశించారో, అక్కడగూడా గెరిల్లాదళాలు తలయెత్తినాయి. ఈ విధంగా యుగోస్లావియా జాతీయైక్యత రోజురోజుకు వృద్ధి అగుటయేగాక, గెరిల్లా ఉద్యమం గూడా ప్రజా స్వాతంత్ర్య ఉద్యమంగా మారింది.

రెండవ విషయం:—ఉద్యమంయొక్క పరిమితిగూడా అన్నివిధాలా వృద్ధి అయింది. జర్మన్ దురాక్రమణదారులను ఎదుర్కొనే దేశభక్తుల సంఖ్య త్వరత్వరగా పెరిగిపోయింది.

మూడవ విషయం:—గెరిల్లాలు ఈనాడు దెబ్బకాచుకునే స్థితిలో లేరు. ఆ స్థితి ఎప్పుడో పోయింది. 1942 లోనూ, 1943 ప్రారంభం లోనూ గెరిల్లాలు దెబ్బకొట్టే స్థితిలోకి వచ్చారు, చిన్నచిన్న దళాలుగాగాక, పెద్దపెద్దసైన్యాలతోనే జర్మన్ సైన్యాలమీద పడి జిల్లాలకు జిల్లాలు విముక్తిగావించుకునే స్థితికి వచ్చింది గెరిల్లా ఉద్యమం.

నాలుగవ విషయం:—గెరిల్లా ఉద్యమాన్ని నడపగల్గిన శక్తి సామర్థ్యాలుగల నాయకత్వం ఏర్పడింది. జాతీయ స్వాతంత్ర్య పోరాటానికి నాయకత్వం వహించే ప్రజా పరిషత్తును యుగోస్లావియా ప్రజలు స్వయంగా ఎన్నుకున్నారు. దేశవ్యాపిత గెరిల్లా ఉద్యమానికి అన్ని రాష్ట్రాలలోనూ కేంద్రాలుఏర్పడి ప్రజలలోకి చొచ్చుకొనిపోయి ధృవపడింది.

జర్మన్ ఫాసిజానికి వ్యతిరేకంగా యూరప్‌ఖండ ప్రజలందరూ స్వాతంత్ర్య పోరాటాన్ని సాగిస్తున్నారు. నార్వేనుంచి గ్రీసువరకూ-యూరపియన్ దేశాలన్నిటిలో నేడు గెరిల్లా పోరాటం జరుగుతోంది. బలవత్తరంగా శత్రువు దేశాన్ని ఆక్రమించిన తరువాత,

సాధారణ సైన్యాలతో నేగాక, గెరిల్లా సైన్యాలతోగూడా పోరాటాన్ని సాగించవలసిన పరిస్థితులు యూరప్అంతా ఏర్పడినాయి. ఈపరిస్థితులలో గెరిల్లాయుద్ధాలకే ప్రాధాన్యతవచ్చింది.

జర్మన్ దురాక్రమణ జరిగిన మొదటిరోజుల్లో, ఆధునిక యుద్ధపరికరాలన్నీ (టాంకులు, విమానాలు, మరఫిరంగులు, మోటార్లు, లారీలు మొదలైనవన్నీ) కల్గిన ఆధునిక జర్మన్ ఫాసిస్టు సైన్యాలతో గెరిల్లా పోరాటంచేయడం ఎలా అనేది ఒక సమస్యగా ఉండేది. యుగోస్లావ్ వీరగెరిల్లాలు ఈసమస్యను పూర్తిగా పరిష్కరించి, గెరిల్లాపోరాటంయొక్క శక్తిని ప్రపంచానికంతకూ చాటారు. ఈ విషయంమీద అనుమానాలు, సందేహాలు ఎవరికీ ఉండనవసరంలేదు. ఆక్రమిత దేశంలోని ప్రజలంతా ఐక్యమయి ఒకటిగా నిలబడితే, ఎంత బలంకల్గిన శత్రువునైనా జయప్రదంగా ఎదిరించవచ్చునని, జర్మన్ ఫాసిస్టులను చావుదెబ్బలు కొడుతున్న గెరిల్లాలు అందరికీ స్పష్టంగా తెలియచేశారు.

నిజమే, గెరిల్లాయుద్ధానికి అనుకూలమైన కొండప్రదేశాలు యుగోస్లావియాలో ఎక్కువగా ఉన్నాయి. జర్మనులు దేశాన్ని ఆక్రమించగానే వేలకువేల దేశభక్తులు తమ ఆయుధాలను తీసుకొని ఈ కొండప్రాంతాల్లోకి ప్రవేశించారు. పురాతన పోరాట సాంప్రదాయంగూడా ఉంది యుగోస్లావియా ప్రజలకు. కాని గెరిల్లా పోరాటం జయప్రదమగుటకు వీటన్నిటికంటె ప్రబలమైన కారణం ఒకటిఉన్నది. దేశంలోని ప్రజలందరూ ఫాసిజానికి లొంగకుండా ఆఖరివరకూ పోరాడాలని చేసుకున్న నిర్ణయంతో గెరిల్లా ఉద్యమాన్ని దేశవ్యాపితంగా బలపరుచుటకు సంసిద్ధులగుటయే గెరిల్లా పోరాట విజయాలకు ముఖ్యకారణం. తాత్కాలికంగా కొన్నాళ్ళవరకూ తమ దైనందిన అలవాట్లకు స్వస్తిచెప్పి, ఆస్తినష్టాలకు, ఇతరకష్టాలకు తలనొగ్గి, దేశద్రోహులకు, విదేశ దురాక్రమణదారులకు తలవొగ్గకుండా రక్తాన్ని ధారపోయుటకు యుగోస్లావియా ప్రజలు తయారైనారు.

ఈవిధంగా యుగోస్లావియా ప్రజలు తమరక్తాన్ని ప్రవహింపజేస్తూ నిలబడి శత్రువును ఎదుర్కొనగల్గినప్పుడు, త్వరలోనే బయట ప్రపంచంనుంచి సహాయంవచ్చింది, ఆయుధసామగ్రి, ఆహారపదార్థాలు – గెరిల్లాయుద్ధానికి అవసరమైన పరికరాలన్నీ మిత్రమండలి ప్రజలనుంచి ప్రవహించటం ప్రారంభమైంది. మిత్రమండలినుంచి సహాయం రాగలదనే ఉద్దేశ్యంతోనే గెరిల్లాలు అడ్రియాటిక్ తీరాన్ని 2 సంవత్సరాలపాటు ఉడుములాగా పట్టుకొని వదలలేదు.

అయితే యుగోస్లావియానుంచి పారిపోయి లండన్‌లోకూర్చున్న పీటర్‌రాజు ప్రభుత్వం, వారి ఏజెంటుగా యుగోస్లావియాలో నిలిచిపోయిన యుద్ధమంత్రి మిహిలోవిచ్ కార్యకలాపాలు చూద్దాం. యుగోస్లావియా గెరిల్లా పోరాటాన్ని పీటర్ బలపరిచాడా? మిత్రమండలిలోఉన్న సామ్రాజ్యవాద ప్రభుత్వాలైన బ్రిటిష్ అమెరికా ప్రభుత్వాలు గెరిల్లా ఉద్యమానికి సహాయం చేయుటకు అంగీకరించినవా? యుగోస్లావియా ప్రజాపరిషత్తును సామ్రాజ్యవాదులు గుర్తించారా? దేశద్రోహిగామారిన మిహిలోవిచ్‌ను ఖండించారా? ఈ విషయాలన్నిటిని ఇప్పుడే చూద్దాం.

# మిహిలోవిచ్, ద్రోహి!

"మిహిలోవిచ్, ద్రోహి" అని 'స్వతంత్ర యుగోస్లావియా' రేడియో 1942 జూన్ 16 వ తేదీన ప్రకటించినప్పుడు ప్రపంచమంతా ఆశ్చర్యపోయింది. ఎందుకని?

అంతవరకూ లండన్, కెయిరో, ఇస్తాన్‌బుల్ రేడియోలు "మిహిలోవిచ్" ని యుగోస్లావియా గెరిల్లా యుద్ధనాయకుడుగా ప్రకటించినాయి. యుగోస్లావియాలో ఫాసిస్టు సైన్యాలను చావుదెబ్బలుకొడుతున్న గెరిల్లాదళాలకు నాయకుడు "మిహిలోవిచ్" అని, గెరిల్లాలు సాధించిన మహత్తర విజయాలకు కారకుడు అతడేనని, మిహిలోవిచ్ సర్బియన్, చెట్నికుల్లతో కలిసి ఫాసిస్టులను ముప్పుతిప్పలు పెడుతున్నాడని ఈ రేడియోలు ప్రతిరోజూ వార్తలమీద వార్తలు చెప్పినాయి మిహిలోవిచ్ గొప్పధీరుడని, వీరుడని ప్రచారం చేసినాయి. అతన్ని గురించి అందరూ కట్టుకథలు అల్లటం ప్రారంభించారు. యూరప్‌లో ఫాసిస్టువ్యతిరేక పోరాటంయొక్క చిహ్నమే మిహిలోవిచ్ అనే సితికి తీసుకొనివచ్చింది ఈ రేడియోల ప్రచారం. ఈ పరిస్థితులలో "స్వతంత్ర యుగోస్లావ్" రేడియో మిహిలోవిచ్ ద్రోహి అని ప్రకటించినప్పుడు అందరికీ ఆశ్చర్యం కల్గుటలో ఆశ్చర్యమేముంది?

అయితే ఈ మిహిలోవిచ్ ఎవరు? ఈ "స్వతంత్ర యుగోస్లావియా రేడియో" ఎవరిది?

1941 ఏప్రియల్‌లో హిట్లర్ సైన్యాలు యుగోస్లావియాను ఆక్రమించినప్పుడు పీటర్ ప్రభుత్వంతో లండన్ చేరకుండా దేశంలోనే దిగబడిపోయిన యుద్ధమంత్రి మిహిలోవిచ్.

యుగోస్లావియాలో జరుగుతున్న గెరిల్లా పోరాటాన్ని గురించి మొదటినుంచీ ప్రపంచాని కంతకూ వార్తలు ప్రకటిస్తున్న ఒకేఒక యుగోస్లావియా రేడియో ఈ "స్వతంత్ర యుగోస్లావియా" రేడియో. గెరిల్లా పోరాట నాయకత్వ ఆధ్వర్యంక్రింద ఈ రేడియో నడపబడుతోందని, గెరిల్లాదళ పోరాటాన్నిగురించి రోజురోజూ యుద్ధవార్తలు ప్రకటిస్తోందని ప్రపంచానికంతకూ తెలిసిన విషయమే. ఈ రేడియో ప్రకటించిన వార్తలనే లండన్‌లోని యుగోస్లావియా ప్రభుత్వం తనప్రకటనలో ఉదహరిస్తూ ఉండేది. లండన్, కెయిరో, ఇస్తాన్‌బుల్ రేడియోలు గూడా, ఈ "స్వతంత్రరేడియో" ప్రకటించిన వార్తలనే యుద్ధవార్తలలో ప్రతిదినం ఉదహరిస్తూ ఉండేవి. తనదేశంలోని దేశభక్తుల తిరుగుబాట్లను ప్రపంచానికి చాటుటకై పీటర్ ప్రభుత్వం ఈ రేడియోవార్తల మీదనే ఆధారపడేది. ఉదాహరణానికి 1942 అక్టోబర్ 21 వ తేదీన లండన్‌రేడియో ఈదిగువ వార్తలను చెప్పింది:—

"జెనరల్ డ్రాహా మిహిలోవిచ్ కొండ కేంద్రరేడియో వార్తలనుబట్టి, దక్షిణ బాస్నియాలో ఫాసిస్టులకు వ్యతిరేకంగా భయంకర యుద్ధాలు జరిగినాయి. 1200 మంది ఫాసిస్టు సైనికులు ఈ యుద్ధంలో గెరిల్లాలచే చంపబడ్డారు."

ఆదేవిధంగా నవంబరు 1 వ తేదీన "స్వతంత్ర యుగోస్లావ్ రేడియో" గెరిల్లాలు లివ్నో పట్టణాన్ని పట్టుకున్నారని ప్రకటిస్తే, లండన్ రేడియో మిహిలోవిచ్ లివ్నోను పట్టుకున్నాడని యుద్ధవార్తలలో చెప్పింది. ఈ ప్రకారంగా "స్వతంత్ర యుగోస్లావియా" ప్రకటించిన గెరిల్లా విజయాలన్నిటికి కారణం మిహిలోవిచ్ నాయకత్వమే అనే అభిప్రాయాన్ని బ్రిటిష్ రేడియోలు, ఇతర మిత్రమండలి రేడియోలు కలుగజేసినాయి.

కాని ఈ "స్వతంత్ర యుగోస్లావియా" రేడియోద్వారా ఒక్కసారిగూడా మిహిలోవిచ్ మాట్లాడలేదు. అతని ప్రకటనలుగూడా ఈ రేడియోద్వారా ఎప్పుడూ తెలియజేయబడలేదు.

అయితే ఏరేడియోమీద ఇన్నాళ్ళు లండన్ మొదలైన రేడియోలన్నీ ఆధారపడినవో ఆ రేడియోయే ఈనాడు "మిహిలోవిచ్ ద్రోహి, అతడు జర్మనులతో కలిసి గెరిల్లాదళాలకు వ్యతిరేకంగా పోరాడుతున్నాడని చెప్తోంది. ఈవిధంగా మిహిలోవిచ్ దేశద్రోహి అని చెప్పటానికి నిదర్శనాలు ఏమిటి?

1942 జూన్ 16 వ తేదీన, మాంటినీగ్రో, బోకా, సాన్‌జాక్ రాష్ట్రంనుంచి పేరుగాంచిన 75 మంది ప్రజా ప్రతినిధులు సమావేశమై ఏకగ్రీవంగా ఒక తీర్మానంచేశారు. ఆతీర్మానాన్ని చేసినట్లు అందరూ సంతకాలుచేశారు వారిపేర్లు "స్వతంత్రయుగోస్లావియా" రేడియో ప్రకటించింది. వారిలో యుగోస్లావియాలోగల అన్ని రాజకీయ పార్టీలకు చెందిన ప్రముఖ నాయకులు, దేశనాయకులు, రాజకీయవేత్తలు, శాస్త్రవేత్తలు ఉన్నారు. వారుచేసిన తీర్మానంలో ముఖ్యభాగాలు ఇవి:—

"ఫాసిస్టు సామ్రాజ్యవాద బందిపోట్లకు వ్యతిరేకంగా మాంటినీగ్రో, బోకా, సాన్‌జాక్ ప్రజలు సాగించే పోరాటం, యుగోస్లావియా ప్రజలందరూ, ఇతర ఆక్రమిత యూరపియన్ ప్రజలతోనూ, మన మిత్రదేశములైన సోవియట్‌యూనియన్, బ్రిటన్, అమెరికా దేశ ప్రజలందరితోనూ కలిసి సాగించే స్వాతంత్ర్య పోరాటంలో ఒకభాగం. గెరిల్లా, వలంటీరు సైన్యాలసహాయంతో మా దేశప్రజలు హిట్లర్‌కు వ్యతిరేకంగా సాగించే పోరాటం యొక్క ఆశయం ఒక్కటే - దురాక్రమణదారులను దేశాన్నుంచి వెళ్ళగొట్టి, ఫాసిజాన్ని నాశనంగావించి మా దేశ ప్రజలను విముక్తిగావించుటయే."

"ఈ స్వాతంత్ర్య పోరాటంలో, ఆక్రమిత ప్రాంతంలో ఎక్కువభాగాన్ని అప్పుడే శత్రువులనుంచి మనదేశప్రజలు విముక్తిగావించుకున్నారు. జర్మన్ ఫాసిస్టుసైన్యాలకు ఏర్పడిన ఈ క్లిష్టపరిస్థితులలో, వారికి సహాయంచేయుటకై మనదేశ ప్రజలలోనుంచే కొంత

మంది ద్రోహులు తయారయారు. బాజోస్టానిషిచ్, మేజర్ గ్రిగోరిజ్, లాచిష్, పావ్లేదు రిషిచ్ మొదలైన యుగోస్లావ్ సైన్యాధిపతులు శత్రువులతో చేరారు. వీరందరూ మిహిలో విచ్ ఆజ్ఞలక్రింద, మిహిలోవిచ్ సహాయంతో, మనదేశ ప్రజలకు వ్యతిరేకంగా యుద్ధాలు చేస్తున్నారని నిస్సందేహంగా రుజువుచేయగల డాక్యుమెంట్లు, సాక్ష్యం ఉన్నాయి. మిహిలో విచ్‌కు జర్మన్ దురాక్రమణదారుల నుంచి సహాయం వస్తోందనిగూడా నిరూపించబడింది. 20 సంవత్సరాలనుంచి ఇటలీ తరఫున యుగోస్లావియాలో పనిచేస్తున్న క్రిస్టోపాపోవిష్‌తో వీరందరూ కలసి మాంటినీగ్రో రాష్ట్రంలో పనిచేస్తున్నారనిగూడా స్పష్టపడింది."

యుగోస్లావియాలో అంతర్యుద్ధాన్ని ప్రేరేపించుటకు కారణం 'మిహిలోవిచ్' అనీ, ఈ ద్రోహాసికంతకూ కారణం ఆ ద్రోహియేననీ అతని అనుచర సైన్యాధిపతిగా పనిచేసిన మేజర్ టాడోరవిష్ మొదలైన వారి వద్ద దొరికిన అధికార పత్రాలే రుజువుచేస్తున్నాయి."

మిహిలోవిచ్ ద్రోహాన్ని బట్టబయలుచేస్తూ శత్రువుతో మిహిలోవిచ్‌కుగల సంబంధాలను, అతడు యుగోస్లావియా ప్రజలకు వ్యతిరేకంగా సాగిస్తున్న యుద్ధాన్ని, ఆపమని లండన్‌లోఉన్న పీటర్ ప్రభుత్వానికి గెరిల్లా ఉద్యమనాయకులు విన్నవించుకున్నారు.

స్లొవేనియా రాష్ట్ర గెరిల్లా నాయకులుగూడా ఇదేవిధంగా లండన్‌లోని పీటర్ ప్రభుత్వానికి మిహిలోవిచ్, అతని అనుచరులు చేస్తున్న ద్రోహాన్నిగురించి తెలియజేశారు. మిహిలోవిచ్ అనుచరులపేర్లుగూడా పేర్కొంటూ వారు స్లొవేనియాను వదిలిపెట్టి శత్రు సేనలలో ఎలా కలిసిపోయిందీ వివరిస్తూ ఈ ద్రోహాన్ని ఆపుటకు లండన్ ప్రభుత్వం పూనుకోవాలని, పీటర్ ప్రభుత్వాన్ని స్వయంగా కలుసుకుని వివరాలు తెలియజేయుటకు తమ ప్రతినిధి ఒకరు వస్తారనిగూడా విన్నవించుకున్నారు.

1942 ఆగస్టు 10 వ తేదీన యూగోస్లావియా గెరిల్లాదళ సర్వసేనాధిపతి జెనరల్ టిటో, మిహిలోవిచ్‌మీద నిందలను బలపరుస్తూ ఈ దిగువవిధంగా ప్రకటించాడు :—

"యుగోస్లావియాకు బయటఉన్న విదేశ పత్రికలన్నీ యుగోస్లావియాలో దేశభక్తులు నాజీలకు వ్యతిరేకంగా నడుపుతున్న పోరాటం అంతా మిహిలోవిచ్ నాయకత్వం క్రింద జరుగుతోందని ప్రకటిస్తున్నాయి. అఖిల యుగోస్లోవియా స్వాతంత్ర్య పోరాట నాయకత్వం ఈ ప్రకటనలన్నీ శుద్ధ అబద్ధంగా పరిగణిస్తోంది. ఎందుకంటే మిహిలోవిచ్ జర్మన్ దురాక్రమణదారులతో పోరాడుటలేదు. హిట్లర్ సైన్యాలకు వ్యతిరేకంగా జరిగే పోరాటమంతా గెరిల్లా, వలంటీరుదళాల కేంద్రకమిటీ ఆధ్వర్యాన జరుగుతోంది మిహిలోవిచ్, అతనిక్రింద పనిచేస్తున్న చెట్నికుల్లు గెరిల్లాదళాలకు వ్యతిరేకంగా రైలుమార్గాలను ఉదాహరణానికిసారాయావో - బ్రాడ్ రైలుమార్గాన్ని కాస్తున్నారు."

ఈ ప్రకటనవచ్చిన 3 రోజుల తరువాత, యుగోస్లావియా యువజన నాయకుడు, ప్రముఖ మాంటినీగ్రో యువజన నాయకుడైన వ్లాడిమిర్ వ్లాహోవిష్ మాస్కోనుంచి

లండన్ ప్రభుత్వానికి ఒకవ్యాసం పంపాడు. వ్లాదిమిర్ స్పెయిన్ ఫాసిస్టు వ్యతిరేకపోరాట సమయంలో "అంతర్జాతీయ సైన్యం"లో చేరి పోరాడాడు. ఆ పోరాటంలో ఒక కాలు విరిగిపోయింది. అతని అంచనాలప్రకారం మిహిలోవిచ్ ద్రోహం 1941 నవంబర్‌లోనే ప్రారంభమయిందని, అప్పుడే మిహిలోవిచ్ అనుచరుడైన మేజర్ కలాబిచ్ తన చెట్నిక్ సైనికులను గెరిల్లాదళాలకు వ్యతిరేకంగా యుద్ధానికి పంపాడని తెలియవచ్చింది.

కాని లండన్‌లోఉన్న పీటర్ ప్రభుత్వం ఈ కలాబిచ్‌ను గౌరవిస్తూ ప్రకటనలు గావించింది. తరువాత గెరిల్లాదళాలచే కలాబిచ్ గాయపడి నెడిష్ ఆస్పత్రి (బెల్‌గ్రేడ్)లో ఉన్నప్పుడు లండన్ ప్రభుత్వం కలాబిచ్‌కు ఒక మెడల్ బహూకరించింది!

ఈవిధంగా మిహిలోవిచ్ చర్యలను గురించి విన్నవించుకున్నా లండన్‌లోఉన్న యుగోస్లావియా ప్రభుత్వం మిహిలోవిచ్‌ను, అతని అనుచరులను గౌరవించుట మాన లేదు. అందువల్ల కలనల్ ఒరోవిష్ "స్వతంత్ర యుగోస్లావియా" రేడియోద్వారా లండన్ ప్రభుత్వచర్యలను ఖండిస్తూ ఒక ప్రకటన చేశాడు. ఈ ప్రకటనలో, పీటర్ ప్రభుత్వం యుగోస్లావియాలో ద్రోహంచేస్తున్న సైన్యాధిపతులను గౌరవించుట సరియైనదిగాదని స్పష్టం చేయబడింది.

అయినప్పటికీ లండన్‌లోఉన్న "యుగోస్లావియా ప్రభుత్వం" ఈ ప్రకటనలను గుర్తించకపోగా మిహిలోవిచ్‌లో తమకు సంపూర్ణ నమ్మకంగలదని, అతడు ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడుతున్నాడని, కలహాలకు కారణమవుతున్న వారికి చక్కటి పాఠాలు చెప్పగల శక్తిసామర్థ్యతలు మిహిలోవిచ్‌కు కలవని (!) పీటర్ ప్రభుత్వం సమాధానం ఇచ్చింది. "స్వతంత్ర యుగోస్లావియా రేడియో" మిహిలోవిచ్ మీద నిందలు వేయుటకు కారణం కమ్యూనిస్టులేనని, "ఇదంతా కమ్యూనిస్టులతోవచ్చిన కలతలని" పీటర్ ప్రభుత్వం ప్రకటించింది. మిహిలోవిచ్ ప్రజాయుద్ధ విజయాలన్నిటికి బాధ్యుడని, కమ్యూనిస్టులు కలహాలుపెట్టే అల్పసంఖ్యాకులని పీటర్ ప్రభుత్వం ప్రచారం చేయడానికి ఇంకా సాహసించింది. తమ 'యుద్ధమంత్రి' అయిన మిహిలోవిచ్‌ను సమర్థించుటయే ప్రధానమని పీటర్ ప్రభుత్వం భావించింది. తాను అవలంబిస్తున్న వైఖరివల్ల యుగోస్లావియా జాతీయైక్యత విచ్ఛిన్నమై ఫాసిస్టులకు సహాయపడుతుందనే భయంకంటె, మిహిలోవిచ్‌పై మోపబడిన నిందలన్నీ త్వరలోనే ఋజువుకాగలవనే భయం పీటర్ ప్రభుత్వానికి ఎక్కువయింది! ఎలాగైనా తన ఏజెంటయిన మిహిలోవిచ్‌కువచ్చిన చెడ్డపేరును తప్పించి మంచి సేనానిగా ప్రచారంచేయాలని పీటర్ప్రభుత్వం ఆదుర్దాపడింది.

అమెరికాలో యుగోస్లావియా పీటర్ప్రభుత్వ రాయబారిగా ఉన్న కాన్‌స్టాంటిన్ ఫోటిష్ ఈ విషయాన్ని గురించి చేసిన ప్రకటన చూడండి :—

"యుద్ధానికి పూర్వంగూడా మాంటినీగ్రో యుగోస్లావ్‌కమ్యూనిస్టుల కేంద్రం. కమ్యూనిజానికి బద్ధశత్రువైన మిహిలోవిచ్ యొక్క పలుకుబడి పెరుగుతుంటే కమ్యూ

నిస్టులు భయపడ్డారు కాబోలు। అందువల్లనే తమను అడ్డంకిగా ఉన్న మిహిలోవిచ్‌ను త్రోసిపారవేసి యుగోస్లావియాలో కమ్యూనిజాన్ని స్థాపించాలని కమ్యూనిస్టులు ప్రయత్నిస్తున్నట్లుంది".

పై ప్రకటనలో ఫాసిస్టుసైన్యాలకు వ్యతిరేకంగా గెరిల్లాదళాలు సాగిస్తున్న పోరాటం విషయం ఏమీ లేదు. పైగా మిహిలోవిచ్ గెరిల్లాలతో పోరాడుతున్నాడనే విషయం రుజువు చేయ ప్రయత్నించింది.

మిహిలోవిచ్‌ను బలపరుచుటకు ప్రయత్నించిన పత్రికలన్నీ అతడు కమ్యూనిస్టులను నాశనంచేస్తున్నాడని గూడా ప్రకటించినాయి. యుగోస్లావ్ గెరిల్లాలు "కమ్యూనిస్టు గెరిల్లా" లని "న్యూయార్క్ టైమ్స్" పత్రిక 1942 అక్టోబర్ 5 వ తేదీన ప్రకటించింది. ఈరకమైన ప్రచారం ప్రకారం, ఫాసిస్టులను నాశనంచేసి స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవాలని చావుబ్రతుకుల పోరాటాన్ని సాగిస్తున్న గెరిల్లాదళాలన్నీ కమ్యూనిస్టుదళాలే। ఆ పత్రికలే మళ్ళీ గెరిల్లాదళాలు ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడి సాధించిన విజయాలనుగూడా కొనియాడుతూ ప్రకటిస్తాయి. "న్యూయార్క్ టైమ్స్" పత్రికయే 1942 చివరిలో ఒక వింత ప్రకటన చేసింది. యుగోస్లావ్ స్వాతంత్ర్య పోరాట దళాలసంఖ్య అకస్మాత్తుగా 30000 కు పడిపోయిందని, ఈ దళాలలో "దొంగలు, ద్రోహులు, బందిపోట్లు, అసంతృప్తి చెందిన క్రోట్లు, ముస్లిములు" మాత్రం ఉన్నారని ప్రకటించింది. యదార్థంగా యుగోస్లావియాలో రోజురోజుకూ బలపడిన గెరిల్లాదళాల సంఖ్యకు, ప్రపంచానికంతకూ రుజువైన ఆ గెరిల్లా దళాల దేశభక్తికి ఈ పత్రికయొక్క ప్రకటనలకు ఎక్కడన్నా పోలిక ఉందా? ఈ విపరీత పరిస్థితి ఎలా ఏర్పడింది?

సోవియట్ యూనియన్‌ను గురించి ఎన్నిసంవత్సరాల పాటు ఈ బూర్జువా పత్రికలు అబద్ధప్రచారం చేయలేదు? అక్కడ ఒకటి జరుగుతుంటే, ఈ పత్రికలు సరిగా దానికి వ్యతిరేకంగా అబద్ధప్రచారం చేయలేదా? యదార్థపరిస్థితి తెలియక కొంతమంది, తెలిసిగూడా బుద్ధిపూర్వకంగా మరికొంతమంది ఇటువంటి అబద్ధప్రచారానికి బాధ్యులయ్యారు. అదేవిధంగా యుగోస్లావియా గెరిల్లా ఉద్యమాన్నిగురించి గూడా అనేక అబద్ధాలు ప్రచారం చేస్తూ మిహిలోవిచ్ ద్రోహినే బలపరచటానికి పూనుకున్నారు పీటర్‌రాజు, అతని మంత్రులు. అతన్ని బలపరచటానికి పూనుకున్న సామ్రాజ్యవాదులు. కాని ఈ దొంగ ఎత్తులు ఎన్నాళ్ళు సాగగలవు? యదార్థపరిస్థితి త్వరలోనే ప్రపంచానికంతకూ వెల్లడి అయి, ఆ గెరిల్లాదళ నాయకుడైన జెనరల్ టిటో చేత గుర్తింపు చేసుకొనుటకై పీటర్‌ప్రభుత్వం ప్రాకులాడే రోజులు గూడా వచ్చినాయి.

మిహిలోవిచ్ గెరిల్లాదళాలను వ్యతిరేకించుటకు కారణం కమ్యూనిజమేనని పీటర్ ప్రభుత్వం సమర్థించే విషయాన్ని గురించి 1942 జూలై 17 వ తేదీన "స్వతంత్ర యుగోస్లావియా రేడియో" ఈ దిగువ విధంగా ప్రకటించింది :—

"తమకు వ్యతిరేకంగా గెరిల్లాదళాలు విజృంభిస్తున్నకొలదీ జర్మన్, ఇటాలియన్ ఫాసిస్టులు యుగోస్లావ్ దేశభక్తులను 'కమ్యూనిస్టు గెరిల్లా కూటమి' అని, ప్రజలను భయబెట్టి ఆస్తులను దోచుకొనుటకు ప్రయత్నిస్తోందనీ అబద్ధప్రచారం చేయ మొదలు పెట్టారు. ఫాసిస్టు ఏజెంట్లు కొందరు విదేశాల్లో గూడా ఇటువంటి అబద్ధప్రచారాన్ని చేయ సాగారు. ఇంగ్లండు అమెరికాలలో గూడా ఈ అబద్ధప్రచారాన్ని బలపరిచే కొంతమంది ఫాసిస్టు అనుకూలురు తయారైనారు. ప్రజలకు శత్రువులైన కొంతమంది ఈ విధంగా యుగోస్లావ్ ప్రజలకు స్వాతంత్ర్యమును కోరే ప్రపంచప్రజల సానుభూతిలేకుండా చేయుటకు ప్రయత్నిస్తున్నారు.

"ఈ ఫాసిస్టు ఏజెంట్లు ఈవిధంగా అబద్ధప్రచారాన్ని సాగించాలని ఎంత ప్రయత్నించినప్పటికి, మా దేశప్రజలు యదార్థంగా గెరిల్లాదళాలు 15 నెలలనుంచి ప్రాణారొడ్డి రక్తాన్ని ధారపోస్తూ దేశస్వాతంత్ర్యం కొరకు ఎలా పోరాడుతున్నదీ కళ్లార చూస్తున్నారు. గెరిల్లాదళాల్లో చేరినవారు అనుపమానమైన దేశభక్తులనే సత్యాన్ని వారు గ్రహించారు. గెరిల్లా స్వాతంత్ర్యపోరాటదళాలు దొంగలతో కూడిన దళాలుకావని మాదేశ ప్రజలందరికి తెలుసును. అందువల్లనే యుగోస్లావియా గెరిల్లా, వలంటీరుసైన్యాలను మనస్ఫూర్తిగా యుగోస్లావియాప్రజలందరూ బలపరుస్తున్నారని నొక్కి చెప్పగలం."

యుగోస్లావియా గెరిల్లాదళ రేడియో అయిన "స్వతంత్ర యుగోస్లావియా రేడియో" ఈవిధంగా ఎప్పటికప్పుడు ఫాసిస్టు అనుకూలుర అబద్ధప్రచారాన్ని ఎదుర్కొనే సాధనంగా మారింది. బయట పీటర్ప్రభుత్వం సామ్రాజ్యవాదులు, గోబెల్స్‌తోపాటుగా గెరిల్లాదళాలు కమ్యూనిస్టుదళాలని ఎంతప్రచారం చేస్తున్నా, తమ కార్యాచరణద్వారా ఫాసిస్టులను అన్ని రాష్ట్రాలలో ఓడిస్తూ, దేశప్రజలందరినీ ఐక్యంచేస్తూ తమ దేశభక్తిపూరితమైన కర్తవ్యాన్ని నెరవేరుస్తూవచ్చారు. గెరిల్లాపోరాట విజయాలు రోజురోజుకూ ఎక్కువయినాయి.

ఈ పరిస్థితులలో లండన్ నుంచి జరిగేప్రచారం యొక్క ధ్వనిమారింది. ఉదాహరణానికి 42 అక్టోబరు 22 వ తేదీన 'టైమ్స్' పత్రిక ఈ దిగువవిధంగా వ్రాసింది:—

"మిహైలోవిచ్ క్రింద పనిచేస్తున్న ఒక గొప్ప ఆఫీసరైన వ్లాడిమిర్ టొడొరొవిష్, యుగోస్లావియాలో ప్రవేశించిన విదేశగెరిల్లాదళాలచే చంపబడ్డాడు. ఈ విదేశగెరిల్లా దళాలు యుగోస్లావియా దేశభక్తులను, ఫాసిస్టుశక్తులను—ఇద్దరినీ ఎదుర్కొంటున్నాయి."

ఏమి తమాషాప్రచారం! గెరిల్లాదళాల్లో పనిచేసేవారు కమ్యూనిస్టులు మాత్రమే కాదు. వారు యుగోస్లావులు కూడా కాదట! తమ జన్మభూమి అయిన యుగోస్లావియాలో పుట్టి, పెరిగిన దేశభక్తులు ఎన్నికష్టాలకైనా వోర్చి ఫాసిస్టుకు వ్యతిరేకంగా తమ శరీరాలను అర్పిస్తూ పోరాడుతుంటే వారందరూ విదేశస్థులైనారు. బ్రిటిష్‌సామ్రాజ్యవాదుల పత్రికకు!

నిజమే, యుగోస్లావ్ గెరిల్లాదళాలు ఒక్క ఫాసిస్టుసైన్యాలనే గాక, తమ యుద్ధ మంత్రి అయిన మిహిలోవిచ్ ద్రోహికిచెందిన సైన్యాలతోగూడా పోరాడుతున్నాయి.

అయితే ఇట్టి విపరీతపరిస్థితి ఏర్పడుటకు కారణం ఏమిటి? మిహిలోవిచ్ - గెరిల్లా దళాలతో ఎందుకు పోరాడుతున్నాడు? జర్మన్ ఫాసిస్టుదళాలతో చేరిపోయిన మిహిలోవిచ్‌ను పీటర్ ప్రభుత్వం ఎందుకు బలపరుస్తోంది? మిహిలోవిచ్ ద్రోహిని బలపరుస్తున్న పీటర్ ప్రభుత్వాన్నే సామ్రాజ్యవాదులు ఎందుకు బలపరుస్తారు? ఈ విషయాలను పరిశీలిద్దాం.

యుగోస్లావ్ గెరిల్లాసైన్యంలో చేరి పోరాడుతున్నవారు దేశభక్తులనుటలో ఏ అనుమానం లేదు. వారి నాయకులపేర్లన్నీ "స్వతంత్ర యుగోస్లావ్‌రేడియో" ఎప్పటికప్పుడు బహిరంగంగానే చెప్పుతూ ఉంటుంది. వారు విదేశస్థులుకారు; పైగా యుగోస్లావియా తమ జన్మభూమి అని ఉప్పొంగి, తమ స్వదేశాన్ని ఫాసిస్టుపిశాచాల నుంచి విముక్తిగావించుటకు సంసిద్ధులైన దేశభక్తులు వారు. అయితే గెరిల్లాదళాలలోచేరి ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడుతున్నవారిలో విదేశస్థులెవరంటే, 2 అంతర్జాతీయదళాలలో పోరాడుతున్నవారు. ఈ రెండుదళాలలో చేరినవారందరూ ఇటలీ, ఆస్ట్రియా, హంగేరీ, జర్మనీ ఫాసిస్టు సైన్యాలను వదిలిపెట్టి వచ్చినవారు మాత్రమే.

గెరిల్లాసైన్యంలో అన్నిరకాల మతాలకు చెందినవారు ఉన్నారు. కాథలిక్కులు, సనాతన క్రైస్తవమతస్థులు, మహమ్మదీయులు, యూదులు, ప్రొటెస్టెంట్లు, నాస్తికులు — అందరూ ఉన్నారు. గెరిల్లాదళాలలో స్త్రీలు ఎక్కువగా ఉన్నారు. దేశం మొత్తంమీద గెరిల్లాసైన్యంలో పనిచేస్తున్నవారిలో దాదాపు మూడోవంతుమంది స్త్రీలే.

ఇక ఈ దేశభక్తులందరూ ఒకే రాజకీయపక్షానికి చెందినవారు కారు. రాచరికాన్ని బలపరిచే వారినుంచి కమ్యూనిస్టులవరకూ అన్నిరకాల రాజకీయవాదులు గెరిల్లాదళాల్లో ఉన్నారు. అయితే మొదటిలో ఏ నిర్మాణం లేకుండా ఈ దేశభక్తులందరూ, హిట్లర్ దేశాన్ని ఆక్రమించిన వెంటనే, కొండప్రాంతాలకు చేరినప్పుడు వారికి ఒక నిర్మాణాన్ని ఏర్పరచుటకు కమ్యూనిస్టులు సహాయపడినమాట వాస్తవమే. కాని గెరిల్లా సైన్యమంతా కమ్యూనిస్టులతో నిండియున్నదనే మాట శుద్ధఅబద్ధం. అందరూ కమ్యూనిస్టులు కాకపోగా, మెజారిటీగూడా కమ్యూనిస్టులది కాదు. ఎక్కువమంది పేదరైతులు, కార్మికులు, మేధావులు, చేతిపనివారు ఉన్నప్పటికీ, ధనవంతులుగూడా గెరిల్లాదళాల్లో లేకపోలేదు.

గెరిల్లాదళ నాయకులు ఎవరో చూద్దాం. యుగోస్లావియా సైన్యానికి చెందిన ముసలి కలనల్ అయిన సావో ఒరోవిష్, స్పెయిన్‌లో ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడిన యువక నాయకుడైన పీటర్, కోస్టానాడ్జ్, వ్లాడా రుకావినాలు, గొప్ప పలుకుబడిగల్గి పార్లమెంటు సభ్యుడైన మార్కో వుయాషిచ్, ప్రముఖ మతప్రబోధకులు, మాస్టర్లు, ఆఫీసర్లు, లాయర్లు, జడ్జీలు, కార్మికులు, రైతులు, గెరిల్లాదళాలకు నాయకులుగా ఉన్నారు.

గెరిల్లాదళాలకు కేంద్రనాయకత్వం ఉంది. రాష్ట్రాలలో రాష్ట్రనాయకత్వం. కేంద్ర నాయకత్వం ఆజ్ఞలను శిరసావహించి పనిచేస్తుంది. ఇక బ్రిగేడ్లు, దళాలు, యూనిట్లు అన్నీ పైనుంచి క్రిందివరకూ ఆర్గనైజ్ చేయబడి ఉన్నాయి.

అయితే, ఇన్ని మతాలకు చెందినవారు, వేరువేరుగా రాజకీయ సిద్ధాంతాలను బల పరిచేవారు, ఆస్తిపరులు, ఆస్తులులేని పేదవారు— వీరందరూ కలిసి తమ మధ్యగల భేదాల నన్నిటినీ త్రోసివేసి ఆదర్శకరమైన ఐక్యతతో గెరిల్లా వలంటీరుసైన్య కేంద్రనాయకత్వం క్రింద ఎలా పనిచేయ గల్గుతున్నారు? ఈ అసమాన ఐక్యతకుగల మూలకారణం ఏమిటి?

ఈప్రశ్నకు ఒకటే సమాధానం ఉంది. తమ కుటుంబాలను నాశనంగావించి, తమ స్త్రీలను అవమానపరిచి తమ పట్టణాలను, గ్రామాలను ధ్వంసంచేసిన ఫాసిస్టు దురాక్రమణ దారులనుంచి ఎంత కష్టనష్టాలకైనా ఓర్చి తమ స్వదేశాన్ని విముక్తి గావించుకొనుటయే వారందరి ఉమ్మడి ఆశయం. ఈ ఏకైక ఆశయమే వారిమధ్యగల భేదాలను నిర్మూలించి వారినందరిని ఐక్యంచేయగల్గింది.

గెరిల్లా దళాలలో చేరుటకు వచ్చినవారు తమ మతం ఏమిటో, తమరాజకీయ అభిప్రాయాలేమిటో, వారు ఏ జాతికి చెందినవారో, లేక వారు ఏ వర్గానికి చెందినవారో చెప్పనక్కరలేదు. కనీసం యుగోస్లావియా భవిష్యత్తును గురించి వారేమనుకుంటున్నారో, భవిష్యత్తులో యుగోస్లావియాకో ఎలాంటి ప్రభుత్వం రావాలని వారు కోరతారో—అదిగూడా చెప్పనక్కరలేదు. ఒకటే ప్రశ్న వారినడిగేది :— "ఫాసిజంక్రింద బానిసత్వాన్ని అనుభ వించుట ఇష్టమా? లేక ప్రాణాపాయానికి గూడా తయారై మీదేశ స్వాతంత్ర్యం కొరకు పోరాడుట ఇష్టమా?"

ఫాసిజంతో రాజీ అనేది అసంభవం. ఈ సూత్రంమీద ఆధారపడి గెరిల్లా సైన్యపు ఎత్తులన్నీ ఉంటాయి. ఏమాత్రం ఆలస్యం చేసినా ప్రమాదమే. మొండిగా పోరాటం చేయుట అవసరం. ఫలితం వీరమరణమో లేక విజయసాధనమో! అంతేకాని, ఇంత కంటె మంచి అవకాశం వస్తుందని వేచిఉన్నావా, అది ఎప్పుడూ రాదేమో! హిట్లర్ వేచి ఉండే పిచ్చివాడు కాడు. వాడిపని చంపటమే. ఆ పరిస్థితులలో ప్రతిక్షణం ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాటం సాగించటమే మన జీవితకర్తవ్యం. ఇంకా మంచి ఆయుధాలు రాగలవని, ఎక్కువ ఆహారపదార్థాలు వస్తవని వేచికూర్చుంటా నంటావా? ప్రతిరోజూ ఫాసిజంలో కొంతభాగాన్ని నాశనం చెయ్యకపోతే ఆ రోజు ఎలా వస్తుంది? చింపిరి దుస్తులు ధరించి భవిష్యత్తుకొరకు స్వార్థత్యాగులై పోరాడుతున్న 3 లక్షలమంది యుగో స్లావ్ దేశభక్తుల జీవితపరిస్థితి ఇది. తెగిపోయిన చెప్పులు, శత్రువుతో చీకట్లో కీచులాడి లాక్కొన్న చొక్కా, చలితోనిండిన గుహలలో చికిత్సాలయాలు—ఇవీ గెరిల్లా సైనికుల స్థితి. ఇట్టి దుర్భరపరిస్థితులలో ఉన్నప్పటికి, ఫాసిస్టుశత్రువులను పరిమార్చుటలో ఎంత మాత్రం ఉపేక్ష వహించకుండుటయే గెరిల్లాయుద్ధ ప్రథమసూత్రం.

ఈ విధంగా క్షణంగూడా శత్రువుకు అవకాశం ఇవ్వకుండా గెరిల్లాలు చేసే యుద్ధ ఫలితాలను లోగడ పరిశీలించియున్నాం. 1941 జూన్‌కు పూర్వం గెరిల్లాల సంఖ్య 30 నుంచి 50 వేల మధ్య ఉండేది. అప్పుడుగూడా 1½ నెలలో 12000 మంది ఫాసిస్టు సైనికులను గెరిల్లాలు చంపేశారు. 200 బ్రిడ్జీలను నాశనం గావించారు. 400 శత్రుకేంద్రాలను (ఆయుధసామగ్రి, ఆహారపదార్థాల కేంద్రాలు) ధ్వంసంచేశారు. ఫాసిస్టుల ఆక్రమణలో ఉన్న 17 మిలటరీ రైళ్ళను బోల్తాకొట్టించారు. 1941 సెప్టెంబరు నెలలో బైనా బాష్టా అనే పట్టణాన్ని స్వాధీనం చేసుకున్నారు. అక్టోబరు నెలలో మాంటినీగ్రో రాష్ట్రంలో అధికభాగాన్ని, సర్బియాలో సగభాగాన్ని, బాస్నియాలో అనేక జిల్లాలను వశం గావించుకున్నారు. ఆ నెలలోనే వాల్వేయ్ అనుపట్టణం గెరిల్లాల వశమయింది. 1941 ఆఖరికి, 1942 ప్రారంభంలోనూ మిగిలిన ఆక్రమిత ప్రాంతంలోని ముఖ్యపట్టణాల నెన్నో తిరిగి ఆక్రమించుకున్నారు. ముఖ్య రైల్వేమార్గాల నన్నిటిమీద దాడులు సాగించారు.

1942 జనవరిలో బాస్నియాలో ఫోకా, విషీగ్రాద్ మొదలైన పట్టణాలు గెరిల్లాల వశమయినాయి. మాంటినీగ్రో గెరిల్లాలు ఆ నెలలోనే సెటిన్యీ (మాంటినీగ్రో ముఖ్య పట్టణం) పాడ్గోరిట్సా పట్టణాలనుండి ఇటాలియన్లను వెళ్ళగొట్టారు. స్లొవేనియా రాష్ట్రంలో గెరిల్లాదళాలు 80 మంది ఇటాలియన్ వైమానికులతో నిండిన రైలును ధ్వంసం గావించారు. వారిలో ఒక్క వైమానికుడు గూడా బ్రతికి బయటపడలేదు. క్రోషియాలో ఈ నెలలోనే 400 మంది ఇటాలియన్ సైనికులు ఖైదీలుగా చిక్కారు.

1942 మేలో మొత్తం 1350 ఇటాలియన్ ఫాసిస్టు సైనికులు హతమయ్యారు. జూన్‌లో జర్మనులు తిరిగి ఒక పెద్దదాడిని సాగించినప్పుడు, 4000 మంది ఫాసిస్టులు మరణించారు. గెరిల్లాలు ఇప్పుడు శత్రువులను వేలలో చంపగలశక్తిని సంపాదించారు జూలై దాడిలో, గెరిల్లా సైన్యాన్ని 25 శత్రుసైన్యాలు ఎదుర్కొన్నాయి. (17 ఇటాలియన్లవి; 4 లేక 5 జర్మన్ సైన్యాలు; 4 హంగేరియన్ సైన్యాలు) ఆదాడిని గెరిల్లాలు జయప్రదంగా ఎదుర్కొని మొత్తం 10400 మంది ఫాసిస్టులను పరిమార్చారు. 4700 మంది ఖైదీలుగా చిక్కారు.

42 జూలై నాటికి జెగ్రేచ్ – బాన్యాలూకా – సారాజీవో లైను పొడుగూనా గల ఆడ్రియాటిక్ సముద్రతీరమంతా గెరిల్లాల చేతుల్లోకి వచ్చింది. ఉత్తరభాగంలో యుగోస్లావియా, ఇటలీ, ఆస్ట్రియా సరిహద్దులమధ్యగల ఒక పెద్ద భూభాగాన్నిగూడా గెరిల్లాలు ఆక్రమించారు. ఇక స్లొవేనియాలో విముక్తి గావించబడిన పెద్ద పట్టణాలతోకూడిన ఒక పెద్ద గెరిల్లా భూమి నిర్మించబడింది.

జూలైలో గెరిల్లాలు సాధించిన మహత్తర విజయాలు క్రోషియాలో ప్రజాఉద్యమాన్ని రేకెత్తించినాయి. జర్మను ఫాసిస్టులు ఈ ఉద్యమాన్ని అణిచివేయాలని ఎన్ని

ప్రయత్నాలుచేయాలో అన్నీచేశారు. అడ్రియాటిక్ సముద్రతీరంలోని గెరిల్లా కేంద్రాల మీద శత్రు యుద్ధఓడలనుంచి మరఫిరంగులుగూడా ఉపయోగించబడినాయి.

2 విమాన ఫాక్టరీలు. షిబెనిక్‌వద్దఉన్న ఒక ఆయుధసామగ్రి ఫాక్టరీని, ఒక సిమెంటు ఫాక్టరీని గెరిల్లాలు కొన్నిమాసాలలో ధ్వంసం గావించారు. బొటోవినో, కోస్టాలాట్స్, మొదలైన బొగ్గుగనుల నన్నింటినీ పనికిరాకుండా పేల్చేశారు.

కొర్డూన్ కాన్సెన్ కాంపులో (జెగ్రేబ్‌వద్ద) 900 మంది పిల్లలను జర్మనులు బంధించారు. వీరందరూ గెరిల్లాదళ సైనికుల పిల్లలే. గెరిల్లాదళాలను లొంగదీయుటకై జర్మనులు వారి పిల్లలను ఇక్కడ బంధించారు. గెరిల్లాసైన్యం ఆ కాన్సెన్‌ట్రేషన్ క్యాంపు మీద దాడిచేసి, ఫాసిస్టు కాపలాదార్లను హతంగావించి, పిల్లలనందరిని విముక్తిగావించారు.

సెప్టెంబరులో గెరిల్లాలు అంతులేని విజయాలను సాధించారు. ఒకపట్టణం తరువాత మరొక పట్టణాన్ని ఆక్రమించారు. అక్టోబర్, నవంబర్ నెలలలో శత్రువుల ముఖ్య కేంద్రాలమీదపడి జర్మన్ ఫాసిస్టులను నాశనంచేశారు.

ఈవిధంగా వరుసగా ఎడతెగకుండా గెరిల్లాలు సాధించేయుద్ధం, ఒక నిర్మాణం, నాయకత్వం, శిక్షణలేకుండా జరుగుతోందని అనుకొనుట అసంభవం. గెరిల్లాదళాలనిండా "ఎందుకూ పనికిరాని బందిపోట్లు" ఉన్నారని సామ్రాజ్యవాద పత్రికలు ప్రచారంచేస్తే ఎంత కాలం నమ్మగలరు? ఈ 'ఎందుకూ పనికిరానిమూక' ఎప్పుడూ ఫాసిస్టులమీదనే దాడిచేసి, నాజీ దురాక్రమణదారులను వెళ్ళగొట్టూ పట్టణంతరువాత పట్టణాన్ని ఆక్రమిస్తున్నదంటే యదార్థం బోధపడుటలేదా?

అయితే ఫాసిస్టులకు వ్యతిరేకంగా యుగోస్లావియాలో సాధింపబడుతున్న విజయాలు ఒక్క గెరిల్లా విజయాలని సామ్రాజ్యవాదులు అంగీకరించిన తరువాత, గెరిల్లాదళాలకు సర్వసేనాధిపతి జెనరల్ టిటోయేగాని మిహిలోవిచ్ కాదని యుగోస్లావియా ప్రజలు చాటుతున్నప్పుడు, మిహిలోవిచ్ ద్రోహిని పీటర్ ప్రభుత్వం బలపరుచుట అక్రమమని స్పష్టపడుతోంది.

అయితే యుగోస్లావియాలో మిహిలోవిచ్ సైన్యాలకు గెరిల్లాదళాలకు మధ్య జరుగుతున్న అంతర్యుద్ధానికి కారణం ఏమిటి? ఈవిషయాన్ని సమగ్రంగా తెలుసుకోవాలంటే, ఈరెండు సైన్యాలమధ్యగల తీవ్రభేదాలను గుర్తించవలసివస్తుంది. పైకి మిహిలోవిచ్ సైన్యంగూడా ఫాసిస్టులకువ్యతిరేకంగా పోరాడుతున్నామని ప్రకటిస్తే చాలదు.

లండన్‌లో ఉన్న యుగోస్లావ్ ప్రభుత్వ నాయకులైన నిన్‌షిష్, జువానోవిష్, గావ్రిలోవిష్ అమెరికాలో యుగోస్లావియా రాయబారిగా ఉన్న కోన్‌స్టాంటిన్ ఫోటిష్ - వీరందరూ సర్బియన్ జాతీయ దురహంకార వాదులు. వారి యుద్ధమంత్రి అయిన మిహిలోవిచ్‌ను ఇంత మొండిగా వారు సమర్థించటానికి కారణాలు వారి ఆశయాలే: యుగోస్లావి

యాలో సర్బియన్ జాతికి చెందిన వారందరిమీద వారి ఆధిక్యతను స్థిరపరచుకొనుటయే వారి ప్రధాన ఆశయం. జాతీయచైతన్యమును పెంపొందించుకుంటూ యుగోస్లావియాలోని జాతులన్నీ కలసి స్వాతంత్ర్యంకొరకు పోరాడుతుంటే ఈ సర్బియన్ దురహంకార వాదులకు భయంకల్గుతోంది. వారి ఏజెంటయిన మిహిలోవిచ్ స్వాతంత్ర్యపోరాట సైన్యాలతో కలిసి ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడకపోవుటకుగూడా ఇదే కారణం. నాజీదురాక్రమణదారులతో పోరాడుటకు మిహిలోవిచ్ ఇష్టపడకపోవుటకు ఇదే కారణం. సర్బియన్ ఆధిక్యతను కాపాడాలని, పనిచేస్తున్న మిహిలోవిచ్‌కు యుగోస్లావ్ ప్రజలందరూ ఒక తీవ్రమైన ఫాసిస్టు వ్యతిరేక నాయకత్వం క్రింద సమీకరించబడుట ఎంతమాత్రం ఇష్టంలేదు. ఫాసిస్టులు ఇతర మిత్రమండలి శక్తులచే నాశనంచేయబడితే, అప్పుడు సర్బియన్లు యదాప్రకారంగా ఇతర జాతులమీద యుగోస్లావియామీద ఆధిక్యతకలిగి పరిపాలన సాగించవచ్చునని మిహిలోవిచ్ ఆశయం! ఇటువంటి విద్రోహ ఆశయాలతో పనిచేస్తున్న మిహిలోవిచ్‌ను, క్రోట్లు స్లొవనీస్ ప్రజలు ఫాసిస్టులను ద్వేషించినంతగా ద్వేషించుటలో ఆశ్చర్యం ఏముంది ?

ఫాసిస్టు దురాక్రమణదారులను నాశనంచేయుటకై అనుక్షణం జాతీయైక్యత అవసరమని గుర్తించిన గెరిల్లాసైన్యం వివిధజాతుల ఐక్యతను బలపరిచే నినాదాలుఇస్తూ ప్రత్యక్షంగా దేశ ముక్తికొరకు పోరాడుతుంటే, జాతీయైక్యతను గర్హించే సర్బియన్ అధికారవర్గం, పీటర్ ప్రభుత్వ ఏజెంటయిన మిహిలోవిచ్ హిట్లర్ సైన్యాలతోచేసే పోరాటంలో వెనుకబడిపోయారు. చివరికి ఐక్యమయి విజృంభిస్తున్న ప్రజాఉద్యమాన్ని అణిచివేయుటకు మిహిలోవిచ్ ఫాసిస్టులతో కలిసిపోవుటకూడా తటస్థించింది. మిహిలోవిచ్ ఫాసిస్టులతో కలిసిపోయినట్లు బల్గేరియన్ పత్రికలయిన 'జోరా' నెడిష్ ఆధ్వర్యంక్రింద నడుపబడిన పత్రికలు అంగీకరించినాయి.

యుగోస్లావియాలో నాజీసైన్యాలు ప్రవేశించినప్పటినుంచి గెరిల్లా సైన్యంయొక్క సర్వసేనాధిపతి జెనరల్ టిటోకు, చెట్నికులకు నాయకత్వం వహించిన మిహిలోవిచ్‌కు మధ్య సంప్రతింపులు జరిగినాయి. ఫాసిస్టులకు వ్యతిరేకంగా యుగోస్లావ్ సైన్యాలన్నీ ఐక్యమవాలని టిటో తెగ ప్రయత్నంచేశాడు. ఐక్యతా సూచనలనుఇస్తూ టిటో ఎన్నిసార్లు ప్రయత్నించినా, మిహిలోవిచ్ స్వయంగా సంప్రతించటానికి అంగీకరించలేదు. అతని అనుచరుల నెవరినో పంపుతూ ఉండేవాడు. 41 అక్టోబర్‌లోగూడా టిటో ఇంకా ఐక్యతకొరకు ప్రయత్నించాడు. అక్టోబర్ 21 వ తేదీన మిహిలోవిచ్‌కు టిటో పంపిన సూచనలు ఇవి :—

(1) జర్మనులకు, జర్మన్ శత్రువులకు అమ్ముడుబోయిన నెడిష్ సైన్యాలకు వ్యతిరేకంగా రెండుసైన్యాలు కలిసి ఒక సంయుక్త నాయకత్వంక్రింద పోరాడుట.

(2) రెండు సైన్యాలకు ఆయుధసామగ్రి, ఆహార పదార్థాలు సప్లయిచేయుటకు ఒక సంయుక్త సప్లయికమిటీ.

(3) శత్రువునుంచి వశంచేసుకునే సామగ్రిఅంతా యుద్ధరంగాల ప్రాముఖ్యతనుబట్టి 2 సైన్యాలకు విభజించుట. 'అంతా యుద్ధరంగాలకే, అంతా పోరాటానికే వినియోగ పడాలి' అనే సూత్రాన్ని ఆధారంచేసుకుని ఈ విభజన జరగాలి.

(4) వశంగావించుకున్న ప్రదేశాలమీద సంయుక్త అధికారాన్ని స్థాపించుట.

(5) ఎక్కడ ఏభేదాలు వచ్చినప్పటికి వాటిని ఆలస్యంలేకుండా వెంటనే పరిష్కరించుటకు సంయుక్త విచారణకమిటీలు.

(6) విముక్తి గావించబడిన ప్రాంతాల్లో ప్రజల ఆహారసప్లయి, ఆర్థికవిధానం, యుద్ధఅవసరాలసప్లయి, శాంతిభద్రతలను కాపాడుట మొదలైనవన్నీ పాతప్రభుత్వ ఆఫీసర్ల చేతుల్లోనూ, పాతపోలీసు డిపార్టుమెంటు చేతుల్లోనూ ఉంచకూడదు. ఈ కార్యాలనన్నిటిని నిర్వహించగల తాత్కాలిక సంయుక్తకమిటీలను ఏర్పరుచుట అవసరం. పూర్వం పనిచేస్తున్న ఉద్యోగులు, పోలీసులలో ఫాసిస్టులపలుకుబడి ఎక్కువగాఉంది. ఎందుకంటే నిన్నటివరకూ దేశాన్ని ఆక్రమించిన నాజీలక్రింద పనిచేస్తున్నవారే ఈ ఉద్యోగులంతా. అందువల్ల ఈ పాతఅధికారవర్గం ఫాసిస్టులకువ్యతిరేకంగా పోరాటంలో సహాయపడుతుందని నమ్మడం అసంభవం. అంతేకాదు, ఈ అధికారవర్గం మీద ప్రజలకు నమ్మకంలేదు. అందువల్ల నేడు ప్రజలచే స్థానికంగా ఎన్నుకొనబడుతున్న జాతీయవిముక్తి కమిటీలే ఈ పనులను నిర్వహించుట అవసరమవుతోంది. ఈ కమిటీలను ప్రజలు స్వేచ్ఛగా ఎన్నుకొనవచ్చును. ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడుటకు సిద్ధమైనవారి నెవరినైనాసరే, వారు ఏరాజకీయ సిద్ధాంతాన్ని బలపరిచినప్పటికి, ఎన్నుకొనవచ్చును ఎన్నుకొనుటకు వీలులేనప్పుడు, వివిధరాజకీయగ్రూపులన్నీ కలిసి కమిటీలను నియమించవచ్చును.

(7) సైన్యంలో చేర్చుకునేటప్పుడు బలాత్కారం పనికిరాదు. బుద్ధిపూర్వకంగా వారికిష్టంవచ్చిన సైన్యంలో ప్రజలు చేరవచ్చును. ఇష్టప్రకారం చెట్నిక్కుల సైన్యంలో చేరినాసరే, లేక గెరిల్లాసైన్యంలో చేరినాసరే ఈవిధంగా స్వేచ్ఛ ఇచ్చినప్పుడు బుద్ధిపూర్వకంగా చేరేసైనికులు మనసార చివరివరకూ పోరాడుతారు.

(8) క్రింది దళాలన్నీ కేంద్రనాయకత్వం ఇచ్చే సూచనలను ఆజ్ఞలను పూర్తిగా శిరసావహిస్తూ పనిచేయాలి.

(9) మనిద్దరికి మధ్యగల భేదాలనుబట్టి, మన రెండుసైనికకేంద్రాలు వేరువేరు పట్టణాలలో ఉండుట అత్యవసరం. లేనియెడల ఒకసమయంలో కలహాలు బయలుదేర వచ్చును. అయితే ప్రతి కేంద్రంలోనూ, రెండోసైన్యం యొక్క ప్రతినిధి గూడా ఒకరు ఉంటారు.

(10) ఫాసిస్టులకు వ్యతిరేకంగా చావుబ్రతుకుల పోరాటాలు చేస్తున్నసమయంలో పంచమాంగదళ చర్యలను శత్రుగూఢచారులను వెంటవెంటనే శిక్షించుటకు ఒక సంయుక్త మిలటరీకోర్టును స్థాపించి, వారిని నిర్దాక్షిణ్యంగా శిక్షించాలి.

(11) జాతీయ స్వాతంత్ర్య పోరాటాన్ని నిరోధించి దేశభక్తులను ఎదుర్కొంటున్న చెట్నిక్కుల సైన్యాలను ప్రతిఘటించుట అత్యవసరం. రెండు సైన్యాలు కలిసి ప్రతిఘటించినాసరే లేక ఎవరో ఒకరికి వదిలిపెట్టినాసరే.

(12) పట్టుబడిన పంచమాంగదళ చీడపురుగులకు చెట్నిక్కుల వార్తాపత్రికలను గాని, గెరిల్లాదళ వార్తాపత్రికలను గాని ఇవ్వకూడదు. అటువంటి పత్రికలనిస్తూ శత్రువులకు సహాయం చేసేవారిని మిలిటరీ కోర్టులో శిక్షించాలి. అనుమానాస్పదులైన వ్యక్తులనందరిని వెంటనే అరెస్టుచేసి, ఒక సంయుక్త విచారణ కమిటీచే విచారింపబడాలి.

జెనరల్ టిటో పంపిన పై 12 సూచనలలో మిహిలోవిచ్ ప్రతినిధులు 1, 2, 6, 7 సూచనలను నిరాకరించారు. అనగా సంయుక్త కమిటీలకు అంగీకరించలేదు, సంయుక్త పోరాటాన్ని అంగీకరించలేదు. పాత అధికారుల స్థానే ప్రజలకమిటీలు ఏర్పడాలనే సిద్ధాంతాన్ని త్రోసివేశారు. సైన్యాన్ని బలాత్కారంగా చేర్చుకొనగూడదనే సూత్రాన్ని గూడా నిరాకరించారు. అయినప్పటికి జెనరల్ టిటో మిహిలోవిచ్ ప్రతినిధులతో ఒడంబడిక చేసుకున్నాడు. ఒడంబడిక జరిగిన మరుసటి రోజునే మిహిలోవిచ్ ద్రోహి గెరిల్లా దళాలమీద దాడి ప్రారంభించాడు।

1941 అక్టోబరు వరకూ మిహిలోవిచ్ ఫాసిస్టులకు వ్యతిరేకంగా ఎట్టి మిలిటరీ కార్యకలాపానికైనా సరే అంగీకరించలేదు. అయినప్పటికి అతని సైన్యం, గెరిల్లాసైన్యం రెండూ సాధ్యమైనంతవరకూ పరస్పరసహాయం చేసుకొనుటకు ఒడంబడిక చేసుకున్నాయి. ఆ ఒడంబడిక ప్రకారం విముక్తిగావించిన ప్రాంతాల్లో చెట్నిక్ సైన్యాలు స్వేచ్ఛగా వారి నిర్మాణాన్ని సాగించుచున్నారు. ప్రారంభ దశలో చెట్నిక్కులు గెరిల్లాదళాలతో గూడా కలిసి కొన్నిచోట్ల ఫాసిస్టులను వ్యతిరేకించారు. కాని ఫాసిస్టుసైన్యాల అత్యాచారాలు ఎక్కువయినకొలదీ, జెనరల్ టిటో మళ్ళీ మిహిలోవిచ్‌కు 2 సూచనలను పంపాడు:—

(1) ఫాసిస్టు శత్రువులకు వ్యతిరేకంగా సంయుక్త మిలిటరీ కమిటీలను ఏర్పాటు చేసి ఫాసిస్టులను ఎదుర్కొనుట.

(2) విముక్తిగావించిన ప్రదేశాలలో ప్రజలచే స్వేచ్ఛగా ఎన్నుకొనబడిన కమిటీలే సివిల్ అధికారాలను కలిగియుండాలి.

మిహిలోవిచ్ ఈ రెండు సూచనలను నిరాకరించాడు సంయుక్తకమిటీలకు అంగీకరించలేదు. పాత అధికారులు, ఉద్యోగులే పరిపాలనను సాగించుట అవసరమన్నాడు. మిహిలోవిచ్ । అప్పటికి జాతీయైక్యతయొక్క అమూల్య ప్రాముఖ్యతను గుర్తించి టిటో

మిహిలోవిచ్‌తో ఒడంబడిక చేసుకున్నాడు. గెరిల్లాదళాల నిజాయితీని, ఐక్యతకోరకు పడే ఆరాటాన్ని నిరూపించుటకు, ఒడంబడిక చేసుకున్న రోజునే 500 తుపాకులు, 40000 తోటాలు మిహిలోవిచ్‌కు టిటో పంపాడు. అయినప్పటికి 3 రోజులు గడవక పూర్వమే చెట్నిక్కులు గెరిల్లాదళాల మీద దాడులుచేశారు. స్పెయిన్ అంతర్జాతీయ దళంలో పనిచేసిన యోధుడు మిలాన్‌బ్లాగోమేవిష్ వారిచే చిక్కినప్పుడు మిహిలోవిచ్, చెట్నిక్ సైన్యాలు అతన్ని చిత్రవధ గావించారు!

చెట్నిక్కుల హత్యాకాండను నిరసిస్తూ మిహిలోవిచ్‌కు గెరిల్లాసైన్యం తరపున టిటో అసమ్మతి తెలియజేశాడు. ఈవిధంగా చెట్నిక్ సైన్యాలు గెరిల్లా దేశభక్తులను రెచ్చగొట్టిన సమయంలోగూడా గెరిల్లాదళాలు శాంతం వహించినాయి. రెచ్చిపోతే ఫలితం అంతర్యుద్ధమేగా! అంతర్యుద్ధం బయలుదేరకుండా చేయుటకై గెరిల్లాసైన్యాలు చివరి నిమిషంవరకూ ప్రయత్నించినాయి.

పై చిత్రవధజరిగిన మరునటిరోజున వాల్వేయో యుద్ధరంగానికి పోతున్న గెరిల్లా దళకారును చెట్నిక్కులు ఆపి, డ్రైవర్‌ను, గెరిల్లా పారావారిని చంపి, కారును ధ్వంసం చేశారు. ఈవిధంగా అనేకప్రాంతాల్లో చెట్నిక్కులు ఘోరమైన చర్యలను చేస్తూవచ్చారు. 1941 నవంబరు 1వ తేదీన గెరిల్లా కేంద్రాలమీదనే దాడులు ప్రారంభించారు చెట్నిక్కులు. యుగోస్లావియా ప్రభుత్వ సైన్యమని పీటర్‌ప్రభుత్వం పిలుచుకునే చెట్నిక్కులు యీవిధంగా, మిహిలోవిచ్ నాయకత్వంక్రింద యుగోస్లావులను చంపుటకు పూనుకొని అంతర్యుద్ధాన్ని ప్రేరేపించారు. ఇక లాభంలేదని గుర్తించి చెట్నిక్కులను నిరోధించవలసి వచ్చింది. ఈ విషాదకాండనంతా జాగ్రత్తగా పరిశీలిస్తున్న జర్మన్ ఫాసిస్టులు గెరిల్లా ప్రాంతాలమీద తీవ్రమైనదాడులు ప్రారంభించారు. చెట్నిక్కులు, జర్మనులు ఈ విధంగా గెరిల్లా దళాలమీద సాగిస్తున్నయుద్ధాలు కలిసిపోయినాయి. అంతర్యుద్ధం ప్రారంభమయిన మొదటిరోజుల్లో ఈ విషాదచర్యలను ఆపమని మిహిలోవిచ్‌కు జెనరల్ టిటో ఎన్నోసార్లు మొరపెట్టుకున్నాడు. మిహిలోవిచ్ చెవులకు యివి వినిపించలేదు.

చివరికి మిహిలోవిచ్ సైనిక కేంద్రంమీద గెరిల్లాదళాలు దాడి చేసినప్పుడు దొరికిన అధికారపత్రాలు 2 విషయాలను రూఢిపరిచినాయి :—

(1) మిహిలోవిచ్ ఇద్దరు యజమానులక్రింద పనిచేస్తున్నాడు. ఒకవైపున తప్పుడు వార్తలన్నీ లండన్‌లోఉన్న యుగోస్లావ్ ప్రభుత్వానికి సప్లయిచేస్తూ, గెరిల్లాదళాలు సాధిస్తున్న విజయాలకు తనే బాధ్యుడని గుర్తింపచేసుకొనుటకు ప్రయత్నిస్తున్నాడు.

(2) అదేసమయంలో జర్మన్లక్రింద తొత్తుఅయి కీలుబొమ్మ ప్రభుత్వాన్ని స్థాపించి పనిచేస్తున్న నెడిష్ వద్దనుంచి, జర్మనులనువద్దనుంచి, కమ్యూనిస్టులకు వ్యతిరేకంగా పోరాడుటకై డబ్బుతీసుకుంటున్నాడు. నిజానికి సర్బియా జాతీయోద్యమాన్ని నాశనంచేయుటకే మిహిలోవిచ్ పనిచేస్తున్నాడు.

ఈ పరిస్థితి ఏర్పడే సమయానికి మిహిలోవిచ్ క్రింద పనిచేసే ప్రత్యేకసైన్యమైనా లేదు. మిహిలోవిచ్ సైన్యంలో మిగిలిన సైనికులందరూ నెడిష్ సైన్యంలో చేరిపోయారు. ఈ విషయంగూడా మిహిలోవిచ్ జర్మనులతో చేరిపోయాడని రూఢిపరుస్తోంది.

మిహిలోవిచ్, ద్రోహి అని ఇంత సాక్ష్యాన్ని చూపిస్తూ యుగోస్లావియా ప్రజా పరిషత్తు మిత్రమండలి ప్రభుత్వాలకు మొరలుపెట్టుకున్నప్పటికి, బ్రిటిష్ అమెరికన్ ప్రభుత్వాలు, లండన్‌లో కూర్చున్న పీటర్ ప్రభుత్వం, మిహిలోవిచ్‌ను ఖండించుటగాని, అతనితో సంబంధాలు త్రెంచుకొనుటగాని చేయలేదు. బ్రిటిష్ పత్రికలుగూడ చాలాకాలంవరకూ మిహిలోవిచ్ ద్రోహి అని తెలియజేసే వార్తనుగూడా ప్రకటించలేదు.

"స్వతంత్ర యుగోస్లావియారేడియో" మిహిలోవిచ్ ద్రోహి అని ప్రకటించినరోజు నుంచి సోవియట్ ప్రభుత్వం ఒక్కటే మిహిలోవిచ్ మిత్రమండలికి వ్యతిరేకంగా చేస్తున్న ద్రోహాన్ని బట్టబయలు చేసింది. అమెరికన్ కమ్యూనిస్టుపార్టీ పత్రిక, బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ పత్రిక డెయిలీవర్కర్, మిహిలోవిచ్ ద్రోహాన్ని గుర్తించి అతన్ని బలపరిచే ఫాసిస్టు అనుకూలవైఖరిని తీవ్రంగా ఖండించసాగినాయి.

అయినప్పటికి లండన్‌లోని పీటర్ ప్రభుత్వం మిహిలోవిచ్‌ను సమర్థిస్తూ, "యుగోస్లావియాను కమ్యూనిజంనుంచి రక్షించడానికి మిహిలోవిచ్ గెరిల్లాదళాలతో పోరాడుతున్నాడని" అతడు ఫాసిస్టు వ్యతిరేకి అని (ఇంకా!) ప్రచారంచేస్తూనేవచ్చింది: ఈవైఖరి యుగోస్లావియా ప్రజాఐక్యతను విచ్ఛిన్నపరచుటయేగాక, హిట్లర్ ప్రచారాన్ని బలపరుచుటకే వినియోగపడింది. మిత్రమండలి ప్రజల ఐక్యతకు దెబ్బతగిలింది. రాజులు, రాచరికాలు ఎన్ని అడ్డంకులు కల్పిస్తున్నా, సామ్రాజ్యవాదులు తమ పెత్తనాన్ని యుద్ధానంతరం సాగించుకోవాలని ఎన్ని కుట్రలుచేస్తున్నా, అన్నిటిని త్రోసివేసుకుటూ ఐక్యమయి ముందుకుపోతున్న ప్రపంచ ప్రజాస్వాతంత్ర్య పోరాటంలో యుగోస్లావియా స్వాతంత్ర్య పోరాటంగూడా ఒక ముఖ్యభాగమని రోజురోజుకూ ఎక్కువగా గుర్తిస్తున్న ప్రజలు మిహిలోవిచ్ దేశద్రోహి, మిత్రమండలికి ద్రోహిఅని త్వరలోనే గుర్తించారు. పీటర్ ప్రభుత్వంగూడా 'మిహిలోవిచ్ ద్రోహి'అని గుర్తించే సమయం వచ్చేసరికి పరిస్థితులన్నీ పీటర్ ప్రభుత్వాన్ని మించిపోకతప్పదు.

# ప్రజలంతా ఒకటిగా నిలబడ్డారు!!

"మిహిలోవిచ్ ద్రోహిని హిట్లర్‌కు అమ్ముడుబోయిన ఇతర ద్రోహాలగు పావెలిష్, నెడిష్, లోటిష్, పెషాన్కులతోపాటు న్యాయస్థానానికిలాగి బహిరంగ విచారణ జరపాలి. చెట్నిక్కు-ఉస్టాషిసైన్యాలకు నాయకత్వం వహించి మిహిలోవిచ్, యుగోస్లావియా ప్రజలైన సర్బులను, క్రోట్లను, క్రిస్టియన్లను, మహమ్మదీయులను చెప్పరాని హింసలుపెట్టి అమానుషనేరాలకు బాధ్యుడవుతున్నాడు" అని యుగోస్లావియా ప్రజలందరూ కలిసి ఎన్నుకొన్న యుగోస్లావియా తాత్కాలిక ప్రభుత్వ ప్రణాళిక ప్రపంచ ప్రజలందరిని సంబోధిస్తూ కోరుతున్నది.

ఈ తాత్కాలిక ప్రభుత్వము ఇవాన్ రిబార్, జెనరల్ టిటోల నాయకత్వం క్రింద ఎలా ఏర్పడిందీ ఇదివరకే తెలుసుకున్నాం. ఈ కొత్త ప్రభుత్వమే గెరిల్లాల ప్రభుత్వమని పిలువబడుతోంది. లండన్‌లోకూర్చున్న యుగోస్లావియా (పీటర్) ప్రభుత్వం ఈగెరిల్లా ప్రభుత్వాన్ని గుర్తించకుండా, యుగోస్లావియా ప్రజల ఐక్యతను విచ్ఛిన్నంచేయుటకై మిహిలోవిచ్‌ను బలపరిచినకొలదీ యుగోస్లావియా ప్రజల జాతీయైక్యత మరింత దృఢపడుతోంది. ప్రజలందరూ మిహిలోవిచ్ ద్రోహి చేసే విచ్ఛిన్న ప్రయత్నాల నన్నిటిని భగ్నంచేస్తూ, ఒకటిగా నిలబడ్డారు.

1942 నవంబర్ 26, 27 తేదీలలో సర్బియా, మాంటినిగ్రో, సాన్‌డ్జాక్, క్రోషియా బోస్నియా, హెర్ట్సగోవినా మొదలైన యుగోస్లావియా రాష్ట్రాలన్నిటినుంచీ వచ్చిన 53 ప్రజాప్రతినిధులు కలిసి యుగోస్లావియా ఫాసిస్టు వ్యతిరేక స్వాతంత్రపోరాటం తరఫున ఏర్పరిచిన ప్రజాపరిషత్తును యుగోస్లావియా ప్రజాసామాన్యమంతా బలపరుస్తోంది. దేశంలోని వివిధజాతులు, స్త్రీలు, పురుషులు, మతాధిపతులు, డాక్టర్లు, యువకులు, విద్యార్థులు- అందరూ తమతమ ప్రత్యేక సంఘాలద్వారా దేశరక్షణకు నడుముకట్టి నడుపుతున్న ఈ నూతన ప్రభుత్వాన్ని బలపరుస్తూ తమ అభివందనాలను తెలియబరిచారు.

నూతన ప్రభుత్వం ఏర్పడినవెంటనే మిత్రమండలి ప్రభుత్వాలకు, సోవియట్ సైన్యాలను ప్రపంచ యుద్ధవ్యూహంలో అసమాన నైపుణ్యతతోనడుపుతున్న మార్షల్ స్టాలిన్‌కు సందేశాలు పంపబడినాయి. స్టాలిన్‌కు పంపిన టెలిగ్రామ్‌లో యుగోస్లావియా ప్రజలు తమ ఫాసిస్టు వ్యతిరేకపోరాట ప్రతిజ్ఞను ఈవిధంగా తెలియజేశారు.

"ఫాసిజానికి వ్యతిరేకంగా ప్రపంచ ప్రజల స్వాతంత్ర్యపోరాటాన్ని నడుపుతూ మహత్తర విజయాలను సాధిస్తున్న వీరాగ్రేసర నాయకుడవైన నీకే మా ప్రథమ జోహా

రులు. ఫాసిస్టు వ్యతిరేక ప్రజాపరిషత్తును స్థాపించి యుగోస్లావియా ప్రజలందరూ విజయం సంప్రాప్తించేవరకూ సోవియట్ ప్రజలతోపాటు ఫాసిజం నాశనమయేంతవరకూ పోరాడుతామని మా దృఢనిశ్చయాన్ని మరొకసారి ప్రకటిస్తున్నాము. ప్రపంచ శత్రువైన ఫాసిజానికి వ్యతిరేకంగా సాగించే పోరాటంలో యుగోస్లావియా ప్రజలకు సోవియట్ ప్రజలకుమధ్య అభేద్యమైన సోదర సంబంధం ఏర్పడింది. ఈ మన ఐక్యతను ఎవరూ విచ్ఛిన్నం చేయలేరు. ఫాసిజం నశించాలి! ప్రజలకే స్వాతంత్ర్యం!"

స్టాలిన్‌గ్రాడ్ వీరులకు పంపిన సందేశంలో,

"స్టాలిన్ సిటీఅయిన స్టాలిన్‌గ్రాడ్‌ను వీరోచితంగా కాపాడి, జర్మన్‌సైన్యాలు అజేయమనే కట్టుకథ అబద్ధమని ప్రపంచానికి చాటిన అజేయ ఎర్రసైనికులైన మీకు యుగోస్లావియా ప్రజలందరి తరఫునా మా జోహారులు. ఆదర్శకరమైన మీరు యుగోస్లావ్ గెరిల్లాదళాలను, ప్రజలను ఉత్తేజపరిచారు."

"స్టాలిన్‌గ్రాడ్‌వీరులు చిరస్థాయి అగుదురుగాక! ప్రజలకే స్వాతంత్ర్యం!" అని ప్రజాపరిషత్తు యుగోస్లావ్ ప్రజల కృతజ్ఞతను తెలియజేసింది. అదేవిధ గా ఫాసిజాన్ని ఎదుర్కొంటున్న అమెరికన్ ప్రజలకు, బ్రిటిష్‌ప్రజలకుగూడా సందేశాలు పంపబడినాయి.

1942 డిసెంబరు 27 వ తేదీన బిహాక్‌పట్టణంలో అఖిల యుగోస్లావియా యువజన మహాసభ జరిగింది. 356 మంది యువక ప్రతినిధులు హాజరయ్యారు. వీరిలో 100 మంది గెరిల్లాదళాల్లోచేరిన యువజనులతరఫున ప్రతినిధులుగా వచ్చారు. ఫాసిస్టుసైన్యాలు ఆక్రమించిన ప్రాంతాలనుంచిగూడా ప్రతినిధులు వచ్చిచేరారు. సమావేశానికి, గెరిల్లా ప్రభుత్వంతరఫున జెనరల్ టిటో, ఫాసిస్టు వ్యతిరేక ప్రజాపరిషత్తు ప్రతినిధులు, యుగోస్లావియా ఫాసిస్టు వ్యతిరేక మహిళారంగం తరఫున ప్రతినిధులుగూడా వచ్చారు.

"స్వాతంత్ర్యమనేది బంగారు ప్లేట్లలో వడ్డించబడేదికాదు. ఆయుధాలు చేతబట్టుకొని స్వాతంత్ర్యాన్ని సాధించవలసియున్నది. చరిత్ర బోధిస్తున్న గొప్ప పాఠంఇది. ఈ నాటి యుగోస్లావియా ప్రజల విముక్తిపోరాటం నిరూపిస్తున్న సత్యంగూడా ఇదే." అని యూరపియన్ దేశాల యువజనుల నందరిని సంబోధిస్తూ, "పోలెండు యువకులారా! జెకొస్లొవేకియా యువజనులారా! మనందరం ఒకేఓడలో ప్రయాణంచేస్తున్నాం. మనందరి ఉమ్మడి శత్రువుగూడా ఒకడే! మనందరి భవిష్యత్తుగూడా ఒకటే! ఆదర్శకరమైన సోవియట్ యువజనులమార్గాన నడిచిపోదాం!" అని యువజన సమావేశ తీర్మానాలు యూరపియన్ యువకులనందరినీ ఫాసిస్టు వ్యతిరేకపోరాటానికి ఉత్సాహపరుస్తున్నాయి. ఇటలీ, హంగెరీ, బల్గేరియా, యువకులను హెచ్చరిస్తూ హిట్లర్‌కు కాపలాకుక్కలుగా పనిచేస్తున్న జర్మన్ యువకులను అనుసరించవద్దని హెచ్చరించబడింది.

"హిట్లర్ సైన్యాలముందు ఓడిపోయాం. కాని లొంగిపోలేదు. యూరపియన్ దేశాల యువకులందరూ తమ శక్తినంతా, ప్రతి అణువునూ, శత్రువును పరిమార్చుటకు

వినియోగిస్తే హిట్లర్‌పీక నొక్కి వేయవచ్చును. ఉపేక్ష ఎంతమాత్రం పనికిరాదు. రక్తం త్రాగిన ఫాసిజంయొక్క అవసానకాలం వచ్చింది. పిరికితనంవల్లగాని, సోమరితనంవల్ల గాని వెనుకబడే యువకుల నెవ్వరినీ ప్రజలు క్షమించరు. ఈ పరీక్షసమయంలో ఉపేక్షా భావం ద్రోహంతో సమానం. దాడిచేయుటకు ముందుకు నడవండి. మనది న్యాయమైన ఆశయం. మనదే విజయం :!"

ఈవిధంగా స్వాతంత్ర్య పోరాటానికి సిద్ధమయిన యుగోస్లావియా యువజనులంతా ఇతరదేశ యువకులనుకూడా కలుపుకొని ఫాసిజాన్ని నాశనంచేయుటకై తమ కార్య క్రమాన్ని నిర్ణయించుకున్నారు. మిహిలోవిచ్ ద్రోహి అని ఖండించారు. డిసెంబరు 19 వ తేదీన బ్రిటిష్ అమెరికన్ యువజనులకు, ఈ అఖిల యుగోస్లావియా యువజన మహాసభ తరపున గ్రీటింగ్స్ పంపించారు.

సందేశాలను పంపిన వారిలో కొందరు యువకవీరుల పేర్లు ఇవి :—

(1) రాంకోషిప్కా, అసిస్టెంట్‌కమాండర్, కొజారాబ్రిగేడ్ (2) బోరికా జివానో విచ్, మెషిన్‌గన్నర్, 2వ సర్బియన్ బ్రిగేడ్ 3) మిల్కాకుఫ్రిన్, గెరిల్లా స్త్రీ క్రోషియా (4) ఇవాన్‌రిబార్, యుగోస్లావియా యువకకమ్యూనిస్టు సంఘ కార్యదర్శి. (5) జూకా. వీకాజిల్లా యువజన ప్రతినిధి (6) మాటిస్టోసిష్, డాల్మేషియన్ బ్రిగేడ్ సహాయసైన్యాధిపతి (7) రాటోరుగోనిష్, బాస్నియన్ ప్రతినిధి (8) ఆషా, కొజారా గెరిల్లా యువతి (9) డ్రాగిష్, మాంటినీగ్రో బ్రిగేడ్‌లో యువకసైనికుడు (10) లూచిన్కా, సర్బియా మహిళా ప్రతినిధి (11) వూకిసామాండిష్, రైతు స్త్రీ ప్రతినిధి (12) వాటన్, మాంటినీగ్రో విద్యార్థిసంఘ ప్రతినిధి (13) విల్కా ఇలిష్, క్రోషియా రైతు స్త్రీ (14) డ్రాగోఎస్లిష్, క్రోషియా (15) ఎర్నస్ట్, స్లొవేనియా (16) స్టొజాన్ చిలాజే (17) బ్రాన్ కొజారిష్, డాల్మేషియా (18) యన్. యన్. హెర్జ్‌గోవినా.

1942 డిసెంబర్ 6, 7 తేదీలలో జరిగిన అఖిల యుగోస్లావియా మహిళా మహా సభలో 160 మంది ప్రతినిధులు, 400 మంది ప్రత్యేకంగా ఆహ్వానించబడిన ప్రేక్షకులు పాల్గొన్నారు. విముక్తిగావించబడిన ప్రాంతాలనుండియేగాక, ఫాసిస్టుల ఆక్రమణలో ఉన్న జిల్లాలనుంచి ప్రతినిధులు వచ్చి హాజరైనారు. ఫాసిస్టువ్యతిరేక మహిళాసంఘాలు దేశంలో అన్ని ప్రాంతాల్లో వందలకువందలు ఏర్పడి ఉన్నాయి పట్టణాల్లో, పల్లెలలోగూడా. వీటిలో కొన్నిసంఘాలు పత్రికలనుగూడా ప్రచురిస్తున్నా, అఖిల యుగోస్లావియా ఫాసిస్టువ్యతిరేక మహిళాసంఘంతరపున నడుపబడుతున్న పత్రిక రెగ్యులర్‌గా ప్రచురింపబడుతోంది.

మహిళామహాసభ తరపున డిసెంబర్ 18 వ తేదీన అమెరికన్ అధ్యక్షుడైన రూజ్‌వెల్ట్ సతికి ఈ క్రింది సందేశాన్ని పంపారు.

"మాదేశాన్ని ఆక్రమించిన ఫాసిస్టు దుండగీడులు, వారికి అమ్ముడు బోయిన మిహిలోవిచ్ మొదలైన ద్రోహులు యుగోస్లావియా ప్రజలమీద చెప్పరాని అత్యాచారాలు

సాగించారు. స్త్రీలను, పసిబిడ్డలను నానాహింసలు పెట్టారు. వీరిని ఎదుర్కొని మాస్వాతంత్ర్యాన్ని రక్షించుకొనుటకై యుగోస్లావియా ప్రజలందరం కలిసి ప్రజావిముక్తి సైన్యాన్ని ఏర్పరుచుకున్నాం. యుగోస్లావియా స్త్రీలందరూ, మాకు సాధ్యమైనంతవరకూ సర్వశక్తులూ వినియోగించి ఈ ఫాసిస్టు వ్యతిరేకస్వాతంత్ర్య పోరాటాన్ని బలపరుస్తున్నారు. శత్రువుల నుంచి విముక్తిగావించుకున్న, జరుగుతున్న ఈమహిళాసభ తరపున అమెరికన్ స్త్రీ లందరికీ మా అభివందనాలు తెలియజేస్తున్నాం. సోవియట్ వీరయువతుల నాయకత్వాన ఐక్యమవుతున్న ప్రపంచ స్త్రీలందరూ ఈ ప్రపంచ ప్రజల స్వాతంత్ర్యపోరాట విజయానికి అమోఘమైన సేవచేయగలరు. ఈ మహత్తర పోరాటంలో అమెరికన్ స్త్రీలు అపారమైన సహాయంచేయగలరు. మనందరం కలిసి ఫాసిస్టు శత్రువును తీవ్రంగా ఎదుర్కొంటేనే, స్త్రీలకు రక్షణ ఉంది."

యుగోస్లావియా ప్రజలందరూ ఈ విధంగా వారి వారి ప్రత్యేక సంఘాలద్వారా ఐక్యమయి స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొంటున్నారు. గెరిల్లా, వలంటీరు సైన్యాలతోచేరి పనిచేస్తున్న డాక్టర్లు, వైద్యసహాయం చేస్తున్నవారందరూ కలిసి వారి ప్రత్యేక సమావేశాన్ని జరిపి, వైద్యదళాలనిర్మాణాన్ని అభివృద్ధిచేయుటకై చర్చలు జరిపారు. 1942 సెప్టెంబర్ 25 నుంచి 27 వరకూ విముక్తి అయిన ప్రాంతంలో ఒకచోట ఈ సమావేశం జరిగింది. అడ్డంకులు ఎన్ని ఉన్నప్పటికీ 50 మంది డాక్టర్లు, ఇంకా గెరిల్లాదళాలతోచేరి పనిచేస్తున్న అంబ్లెన్సుదళాల తరపున ప్రతినిధులు, నర్సులు ప్రతినిధులుగా వచ్చారు. వీరు చర్చించిన ప్రధాన విషయాలు నాలుగు (1) సైనిక సర్జెరీ (2) గెరిల్లా సైన్యంయొక్క అంబ్లెన్సుశాఖా నిర్మాణాన్ని ఎలా అభివృద్ధిచేయాలి. (3) గాయపడినవారికి, జబ్బుపడినవారికి ప్రధమచికిత్స (4) విముక్తిగావించిన ప్రదేశాల్లోని ప్రజలఆరోగ్యాన్ని అభివృద్ధిచేయుటకై వైద్యసహాయం. బెల్‌గ్రేడ్ విశ్వవిద్యాలయంలో పూర్వం ప్రొఫెసర్‌గాఉన్న సిమో మిలోషివిష్ సమావేశానికి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. వైద్యసహాయవిషయాలను చర్చించుటయేగాక, మిహిలోవిచ్ ద్రోహాన్ని ఖండిస్తూ ఈ సమావేశం ఏకగ్రీవంగా తీర్మానించింది. ఫాసిస్టు క్రూరులు, అంతర్జాతీయ సాంప్రదాయాలనుగూడా లెక్కజేయకుండా జరుపుతున్న ఘోరచర్యలను నిరసిస్తూ జీనీవాలోని అంతరార్జాతీయ రెడ్‌క్రాస్ సంఘానికి తీర్మానం పంపింది.

గతనవంబరులో సర్బియన్ మత ప్రబోధకుల సమావేశం బోసాన్కాక్రెయినా ప్రాంతంలో జరిగింది. ఈసమావేశానికి వివిధప్రాంతాలనుంచి మత ప్రబోధకుల ప్రతినిధులు వచ్చారు. ఫాసిజంఅంటేనూ, జనరల్ మిహిలోవిచ్ అంటేనూ మత ప్రబోధకుల వైఖరి తెలుసుకొనుటకు ఈ సమావేశంలో జరిగిన తీర్మానాలు చూస్తే సరిపోతుంది. ఈ సమావేశంలో చేయబడిన తీర్మానాలను "స్వతంత్ర యుగోస్లావియారేడియో" బ్రాడ్‌కాస్ట్ చేసింది.

"ప్రజాస్వాతంత్ర్య గెరిల్లా, వలంటీరుదళాలను సర్బియన్ మత ప్రబోధకుల మంతా బలపరుస్తున్నాం. సర్బియన్ ప్రజలు, యుగోస్లావియా మత ప్రబోధకులు, ఇతర దేశాల్లో స్వాతంత్ర్యమును కాంక్షించే ప్రజలందరూ ఈ ప్రపంచ ప్రజల పవిత్ర స్వాతంత్ర్య పోరాటాన్ని పూర్తిగా బలపరచమని కోరుతున్నాము."

"20 సంవత్సరాల నుంచి సర్బియన్ చర్చి అధికారులు కల్గించిన అడ్డంకులవల్ల, సోదరులైన సోవియట్ ప్రజలతోనూ, రష్యన్ చర్చితోనూ మాకు సంబంధాలులేకుండా చేయబడినాయి. సోవియట్ యూనియన్‌లోని యదార్థజీవిత పరిస్థితులను మేము తెలుసు కొనకుండా సర్బియన్ సనాతన చర్చి ఇన్నాళ్ళనుంచి మరుగుపరిచింది. ఈ ప్రజాయుద్ధ కాలంలో మేము నిజపరిస్థితులను తెలుసుకొనగల్గాం."

"కొత్త సామాజిక విధానాన్ని" ప్రవేశపెట్టామని చెప్పే ఫాసిస్టులు మనదేశంలో ఎప్పుడూ కని విని ఎరుగనటువంటి అత్యాచారాలను చేశారు. వేలకువేల సర్బియన్లను చంపేశారు ఫాసిస్టులు. ఈ పరిస్థితులలో సర్బియన్లు — మత ప్రబోధకుడుగాని, సాధారణ పౌరుడుగాని—ఎవరైనాసరే ఫాసిస్టు దురాక్రమణదారులతో కలియుటఅంటే దేశద్రోహమే."

"కొద్దిమంది మతగురువులు దురాక్రమణదారులతో కలిశారు. ఫాసిస్టులను బల పరుస్తున్నారు. వారినిగూడా దురాక్రమణదారులతోపాటు లెక్కిస్తున్నాం. ఫాసిస్టు దుండగీడులతో పోరాడుతున్న మత ప్రబోధకులనందరిని అభినందిస్తున్నాం."

గెరిల్లాదళాలలోచేరి పనిచేస్తున్న మత ప్రబోధకులనందరిని ఈ సమావేశం అభినందిస్తోంది.

" ఈ ప్రజావిముక్తి పోరాటంలో సర్బులు, స్లోవనీస్, ముస్లిం ప్రజలందరూ సోదర భావాన్ని పెంపొందించుకుంటూ పోరాడుతున్నారు. దేశప్రజలకు ప్రవహిస్తున్న సోదర దేశభక్తుల జీవరక్తమే ఈ సోదర సంబంధాలను అభివృద్ధిచేస్తోంది. ఈ నూతన జాతీయైక్యత ఎంత బలమైన శత్రుశక్తిఅయినా నాశనం చేయలేదు. అన్నిజాతుల ప్రజలు గెరిల్లా దళాల్లోచేరాలి. మత ప్రబోధకులంతా గెరిల్లా స్వాతంత్ర్య పోరాటసైన్యాన్ని బలపరచాలి."

" మా ప్రజలందరికి ద్రోహంచేస్తూ, జర్మన్ దురాక్రమణదారులతో కలిసి యుగోస్లావియా దేశభక్తులకు వ్యతిరేకంగా యుద్ధంసాగిస్తున్న మిహిలోవిచ్ మొదలైన ద్రోహులను మేము ఖండిస్తున్నాం."

యుగోస్లావియాలో స్వాతంత్ర్యంకోరే ప్రజలందరూ, మత ప్రబోధకులతోసహా ఈవిధంగా జాతీయ విముక్తిపోరాటాన్ని బలపరుచుటకు ముందుకువచ్చారు. పూర్వం దేశాన్నిపాలించిన ప్రభుత్వవర్గ ప్రతినిధులు ఎన్నిఅడ్డంకులు కల్పించినా, యుగోస్లావియా జాతీయైక్యత నానాటికి వృద్ధిఅయింది. మిహిలోవిచ్ మొదలైన ద్రోహుల సహాయంతో పొందిన తాత్కాలిక విజయాలు ప్రజల మనోధైర్యాన్ని, పోరాట ఐక్యతను విచ్ఛిన్నం

చేయలేకపోయినాయి. సర్బియా, స్లొవేనియా, మాంటినీగ్రో, క్రోషియా రాష్ట్రాలలో గెరిల్లా ఉద్యమం మిన్నుముట్టింది.

ప్రజలంతా ఒకటిగానిలబడి దేశశత్రువును ఎదుర్కొంటూ అభేద్యమైన జాతీయైక్యతను నిర్మించుకొన్నప్పుడు, శత్రుపక్షంలో చీలికలు బయలుదేరినాయి. ఫాసిస్టు ఆజ్ఞల క్రింద పోరాడవలసివచ్చిన క్రోట్ సైనికులు గుంపులు గుంపులుగావచ్చి గెరిల్లా దళాలతో చేరిపోయారు.

ఫాసిస్టులకు వ్యతిరేకంగాసాగిస్తున్న స్వాతంత్ర్యపోరాటం అపూర్వ జాతీయఐక్యతా ఉద్యమాన్ని నిర్మించింది. ఈనాడు విముక్తి గావించబడిన రాష్ట్రాలలోని ప్రతిగ్రామంలో ఒక జాతీయ విముక్తికమిటీ ఏర్పడింది. ఇంకా ఫాసిస్టులక్రింద ఉన్న ప్రాంతాల్లో రహస్యంగా పనిచేస్తున్న గ్రామకేంద్రాలు దేశభక్తులను సమీకరించే పోరాటకేంద్రాలుగా తయారైనాయి. ఈ జాతీయవిముక్తి కమిటీలన్నీ ప్రజలలో బ్రహ్మాండమైన పలుకుబడి గల్గిన ప్రజాకమిటీలుగా మారినాయి. గ్రామ జాతీయవిముక్తి కమిటీఅంటే ఆగ్రామప్రజల ఐక్యశక్తియొక్క ప్రతిబింబమే. ఈవిధంగా దేశమంతటా యుగోస్లావియా ప్రజలు తమంతటతామే తమ ప్రజాకమిటీలను ఎన్నుకున్నారు.

ఒకటిగానిలబడ్డ యుగోస్లావియా ప్రజల రాజ్యాంగసంస్థయే వారు ఎన్నుకున్న ప్రజాపరిషత్తు ఈ కేంద్రసంస్థ ఫాసిస్టు వ్యతిరేకపోరాట కేంద్రంగా పనిచేయటమేగాక, విముక్తిగావించబడిన ప్రాంతాల్లో ప్రజాస్వామ్య సూత్రాలమీద ఆధారపడి, గ్రామవిముక్తి కమిటీలద్వారా తాత్కాలిక ప్రభుత్వవిధులనుగూడా నిర్వహిస్తూ వచ్చింది. యుద్ధరంగాల్లోనూ, రంగాలవెనుక ప్రజా ఐక్యతాబలాన్ని పెంపొందిస్తూ, విముక్తి గావించబడిన ప్రాంతాల్లోని ప్రజలనూ ఇంకా ఫాసిస్టు ఆక్రమణక్రిందఉన్న ప్రజలను ఐక్యపరుస్తూ ఈ కేంద్రసంస్థ ప్రజాఐక్యతా కేంద్రంగా పనిచేస్తూవచ్చింది. గెరిల్లాసైన్యాలకు కావలసిన సప్లయిలను, విముక్తి గావించబడిన ప్రజల కవసరమైన నిత్యజీవితావసరాల సప్లయిలను ఈకేంద్రం ఆర్గనైజ్ చేసింది. ప్రజలయొక్క స్వేచ్ఛకు, ఆస్తులకు రక్షణనిచ్చింది. ప్రజా విజ్ఞానాన్ని పెంపొందిస్తూ, సాంఘిక ఆరోగ్యసమస్యలనన్నీ పరిష్కరిస్తూ ఈ కేంద్రం ఫాసిస్టులకు వ్యతిరేకంగా ఒకటిగానిలబడ్డ యుగోస్లావియా ప్రజల స్వాతంత్ర్యకేంద్రంగా మారిపోయింది.

నేటి యుగోస్లావియా స్వాతంత్ర్యపోరాట సర్వసైన్యాధిపతి జనరల్ టిటో.

మార్షల్ "టిటో" పేరంటే యుగోస్లావియాలోని నాజీకిరాతకులకు సింహస్వప్నం. ఎవరీ "టిటో" ?

"టిటో" పూర్తినామం జోసిప్‌బ్రాజ్. "టిటో" అన్నది మారుపేరు. నేడు మార్షల్ టిటో వయస్సు 53 సంవత్సరాలు. అతని యవ్వనమంతా (20—30 ఏండ్లమధ్య) యుద్ధంలో,

జైళ్ళలో, అప్పుడే తలయెత్తిన సోవియటు రిపబ్లిక్‌ను రక్షించుటలో గడిచిపోయింది. 30–40 ఏండ్ల మధ్యకాలమంతా, యుగోస్లావియా కమ్యూనిస్టు ఉద్యమాన్ని నిర్మించుటలో గడిపాడు. ఈకాలంలోనే జైళ్ళు, రహస్య జీవితంకూడా చవిచూచాడు. 47వ ఏట స్పెయిన్‌లో స్పానిష్ ప్రజాస్వామ్య రక్షణకోసం, ఫాసిస్టులతో యుద్ధంచేశాడు. ఈనాడు మార్షల్ టిటో 2 లక్షల గెరిల్లాసైనికులకు సర్వసైన్యాధిపతి. యుగోస్లావియా ఇంకా నాజీ ఆక్రమితదేశమేఅయినా, మార్షల్ టిటో యుగోస్లావియా తరపున ఒక స్వతంత్ర దేశనాయకుడుగా మిత్రరాజ్యాలలో పరిగణించబడుతున్నాడు. యుగోస్లావియాలోని విభిన్నజాతులను, విభిన్నరాజకీయపక్షాలను ఐక్యపరచి, హిట్లరుకు వ్యతిరేకంగా అభేద్యమైన గోడకట్టిన టిటో జీవిత విశేషాలేమిటి?

టిటో వ్యక్తిగత జీవితాన్ని గురించి అట్టే తెలియదు. అతనికి పెండ్లి అయింది. ఇద్దరు కొడుకులున్నారు. అంతే; అంతకన్న విశేషాలేమీ తెలియవు స్వాతంత్ర్యంకోసం. సమానత్వంకోసం, యుగోస్లావియా గావించినపోరాట చరిత్రయే అతని జీవితచరిత్ర. అందుచేత అతని జీవితం చరిత్రా ఒక్క వ్యక్తికేచెందవు. దేశాని కంతకూ చెందుతాయి.

పర్వతమయమైన జాగ్రెబ్ జిల్లాలో, జాగోర్జి అనేగ్రామంలో ఒక బీదకుటుంబంలో జోసిఫ్‌బ్రాజ్ (టిటో) పుట్టాడు. ఇది క్రోషియాలోనిది. ఆస్ట్రియా - హంగరీ (1914 కు పూర్వం) సామ్రాజ్యవాదం క్రోషియాను బానిసగాచేసి పీడించుతుండేది. ఆస్ట్రియా - హంగరీ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా తిరుగుబాట్లు చేసేది క్రోషియా. అక్కడ జన్మించిన పిండం అవడంచేత, తిరుగుబాటుతత్వం టిటో నరనరాన జీర్ణించుకుపోయింది.

సామ్రాజ్యవాద ప్రభుత్వం నిర్బంధంగా అందరినీ యుద్ధానికి పంపుతోంది. అలాగే 'టిటో'ను కూడ 1914 లో పంపింది. ఆస్ట్రియా - హంగరీ సామ్రాజ్యానికి, జారు చక్రవర్తుల రష్యాకు యుద్ధం జరుగుతోంది. రెండు సామ్రాజ్యవాదాలు పోట్లాడుకొంటున్నాయి. యుద్ధంలో టిటోకు అభిరుచి ఎలావుంటుంది? 1915 లో అస్త్రసన్యాసంచేసి రష్యనవైపుకు పోయాడు. ఇతనొక్కడేకాదు ఇలాచేసింది; ఆదేశస్థులు అనేకమంది ఇలాగేచేశారు. రష్యాప్రభుత్వం యుద్ధఖైదీగా అతనిని జైలులో పెట్టింది.

ఇంతలో 1917 నవంబరువిప్లవం వచ్చింది. ఇది "టిటో"కు ఒక నూతన అనుభవం కల్గించింది. సోవియట్ ప్రభుత్వం అతనిని విడుదలచేసింది. కార్మిక కర్షకుల సోవియట్లలోని ప్రజల అత్యద్భుతశక్తి అతని కళ్ళు తెరిపించింది. సోవియట్ ప్రభుత్వాన్ని మొగ్గలోనే తునిమివేయడానికి సంకల్పించి దండెత్తిన సామ్రాజ్యవాద ప్రభుత్వాలకు వ్యతిరేకంగా రెడ్‌ఆర్మీ పోరాడుతోంది. దానిలోచేరి మూడేండ్లు సోవియట్ రక్షణార్థమై టిటో పోరాడాడు. స్వాతంత్ర్యం అంటే ఏమిటో, దాన్ని సంపాదించాలన్నా, సంరక్షించుకోవాలన్నా, ఎంత కష్టమో అతడు గ్రహించాడు.

(7)

1921 లో తిరిగి యుగోస్లావియాకు వెళ్ళారు. యుగోస్లావియా నామకః 'స్వతంత్ర'-'స్వేచ్ఛా' దేశమే. ఆస్ట్రియా - హంగరీ పెత్తనం పోయి ఇప్పుడు సెర్బ్ జాతీయ దురహంకార ముఠా పెత్తనం వచ్చింది. నిజమైన స్వాతంత్ర్యం వీరనుభవించాలంటే. ఈ సంకుచితముఠాను కూలద్రోయాలి. టిటో వెంటనే కమ్యూనిస్టుపార్టీని నిర్మించ ప్రారంభించాడు. టిటో, క్రోట్ కార్మిక నాయకుడయ్యాడు. అతడు నడిపిన లోహయంత్రాగార కార్మికసంఘం మంచి దిట్టమైన సంఘాలలో ఒకటి.

ఈ కార్యకలాపాలకు గాను 1923 లో అరెస్టుగావింపబడ్డాడు టిటో. 5 ఏండ్ల శిక్ష విధించారు. జైలులో చాలావిషయాలు చదివాడు, నేర్చుకొన్నాడు. జైలునుండి విడుదల కాగానే తన కార్యక్రమం కొనసాగించాలనే పట్టుదల మరింత దృఢమైంది. టిటో రహస్య జీవితం గడపవలసివచ్చింది. 1929 జనవరిలో పరిపాలకముఠా బహిరంగంగా డిక్టేటర్‌షిప్ (నియంతృత్వం) అవలంబించింది. కమ్యూనిస్టులైన టిటో సహచరు లెంతోమంది అరెస్టు చేయబడి హత్యచేయబడ్డారు. అందులో యుగోస్లావియా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శియూ, అద్భుత ప్రతిభాశాలియునైన ద్యాకోవిచ్ ఒకడు. యుగోస్లావియా నియంతలు పార్టీపైనే ముఖ్యంగా కేంద్రీకరించి దెబ్బతీశారు. కొంతకాలం పార్టీ బలహీనబడింది.

కాని టిటో, తదితర యుగోస్లావియా కమ్యూనిస్టులు చాల తీవ్రంగా పనిచేశారు. నియంతృత్వాన్ని ఎదుర్కోడానికిగాను అన్ని ప్రజాస్వామ్య పక్షాలూ కలిసి సంయుక్త ప్రజా సంఘటన ఏర్పరచాలని 1933 లో కమ్యూనిస్టుపార్టీ నిశ్చయించింది. సంయుక్త సంఘటన కార్యక్రమంలో మొట్టమొదటి అంశం వివిధజాతులకు స్వయంనిర్ణయ హక్కును ఇయడం. స్వతంత్ర ప్రజాస్వామ్య యుగోస్లావియాలో, క్రోట్ జాతివారికి, స్లోవ్ జాతివారికీ బోస్నియా ముస్లింలకూ స్వయంనిర్ణయహక్కు, సమానహోదా ఇవ్వాలని నిశ్చయింపబడింది.

నెమ్మది నెమ్మదిగా యుగోస్లావియా కమ్యూనిస్టుల కార్యక్రమం ప్రజలలో చొచ్చుకుపోసాగింది. 1938 లో జర్మనీ ఇటలీలతో స్టోయాడి నొవిచ్ ప్రభుత్వం బహిరంగ సహకారంచేసి, ఫాసిజాన్ని బలపరచుతూ వచ్చిందో, అప్పుడు ఫాసిస్టు ప్రతికూలపార్టీలన్నీ ఒక ప్రజాస్వామ్య పక్షంగా కలిశాయి.

ఈ కాలంలోనే టిటో స్పెయిన్‌లో ఇంటర్నేషనల్ బ్రిగేడ్‌లోచేరి పోరాడాడు. ఇక్కడే చాల ముఖ్యమైన మిలిటరీ విషయాలు తెలిసికొన్నాడు. 1939 లో తిరిగి తన దేశం వెళ్ళాడు. హిట్లర్, యుగోస్లావియాపై దండెత్తగానే, ఒక్కవారంలోనే లొంగిపోయింది. కాని టిటో, ఇంకా అనేకులు పర్వతప్రాంతాలకు పారిపోయారు. అక్కడనుండి ఫాసిస్టులను ఎదిరించ సంకల్పించారు. అతనితోపాటు ఇంకా స్పానిష్ స్వాతంత్ర్యంకోసం పోరాడిన యోధులున్నారు. మాంటినీగ్రో గెరిల్లానాయకుడైన "డ్రాబ్ కేవిక్," బోస్నియా గెరిల్లా నాయకుడైన "నాడ్జ్", టిటోతోపాటు ఉన్నారు.

హిట్లరు సోవియటుపై దండెత్తిన తర్వాత టిటోబలం మరింత త్వరగా హెచ్చింది. సెర్బ జాతీయ దురహంకారముతాను నడిపిన మిహిలోవిచ్ జర్మన్లతో సహకారంచేయడం మొదలుపెట్టారు. యుగోస్లావియాలోని చిత్తశుద్ధికల దేశభక్తులందరూ టిటోతో చేరారు. 1942 లో నేషనల్ అసెంబ్లీ సమావేశమైంది. 1920 లో యుగోస్లావియా కాన్స్టిట్యూయెంటు అసెంబ్లీకి అధ్యక్షుడుగాఉన్న డాక్టర్ ఇవాన్ రిబార్, యీఅసెంబ్లీకికూడా అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు.

మతాధిపతులు, ఆఫీసర్లు, మధ్యతరగతివారు, కార్మికులు, రైతులు, అన్ని తరగతులవారు, అన్నిజాతులవారు, అన్ని రాజకీయ పార్టీలవారు టిటో జండాక్రింద నిలబడ్డారు. టిటో ఏకగ్రీవంగా ప్రభుత్వ అధ్యక్షుడుగాను, సర్వ సైన్యాధిపతిగాను ఎన్నుకోబడ్డాడు.

ఇదీ టిటో జీవితచరిత్ర. ఇది ఒక్క టిటో జీవితచరిత్ర మాత్రమేగాదు. క్రోట్లు స్లోవెనీలు. బోస్నియన్లు, మోంటినెగ్రిన్లు, సెర్బులు - ఇలా అన్నిజాతులవారూ కలిసి ప్రజాస్వామ్య రిపబ్లిక్కై పోరాడిన యుగోస్లావియా చరిత్రకూడా.

అనేక సంవత్సరాలుగా, అభివృద్ధి నిరోధక నాయకులు, స్వార్థపరులు, పరిపాలకముఠా, జాతులమధ్య వైషమ్యాలు కల్పించి పోట్లాటలుపెట్టారు. ఈ అనైక్యత ఫలితంగా నిరంకుశ నియంతృత్వ ప్రభుత్వంక్రింద ప్రజలు పడ్డబాధలిన్నిన్నికాదు. టిటో సాధించిన విజయం యుగోస్లావియా కమ్యూనిస్టుపార్టీ సాధించిన విజయంకూడా. చరిత్రలో మొట్టమొదటిసారిగా వివిధజాతులు మంచి క్రమశిక్షణతోకూడిన అభేద్యమైన ఐక్యతను నెలకొల్పారు.

టిటోమీద తమకుగల సంపూర్ణ విశ్వాసాన్ని తెలియబరుస్తూ యుగోస్లావియా ప్రజలు ప్రజాపరిషత్తుద్వారా ప్రకటించారు. ఫాసిస్టు సైన్యాలను చావుదెబ్బలుకొట్టూ స్వాతంత్ర్య పోరాటాన్ని జయప్రదంగా నడుపుతున్న జెనరల్ టిటో కేంద్రనాయకత్వం క్రింద యుగోస్లావియా ప్రజలందరూ ఇంకా ఎక్కువగా ఐక్యమయ్యారు. స్టాలిన్ నాయకత్వం క్రింద సోవియట్ప్రజలు సోవియట్ - జర్మన్ యుద్ధరంగంలో ఫాసిస్టులను నాశనంచేస్తూ వెనక్కు తరుముతుంటే, జెనరల్ టిటో నాయకత్వంక్రింద యుగోస్లావియా ప్రజలు ప్రపంచ శత్రువైన ఫాసిజాన్ని ఎదుర్కొనే రెండవరంగంగా పరిణమించారు.

ఈ పరిస్థితులలో 43 డిసెంబర్ మొదటివారంలో యుగోస్లావియా ప్రజాప్రతినిదులందరూ కలిసి టిటో నాయకత్వంక్రింద ఒక తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసుకున్నారు. అన్నిరాష్ట్రాలనుంచి 140 మంది ప్రతినిధులు హాజరైనారు. అంతవరకూ ప్రజాపరిషత్తుకు అధ్యక్షుడుగాఉన్న ఇవాన్ రిబార్ అధ్యక్షతక్రింద యుగోస్లావియా పార్లమెంటు ఏర్పాటు చేయబడింది. యుగోస్లావియాలోని వివిధ రాష్ట్రాలవారి స్వపరిపాలనా హక్కును గుర్తిస్తూ ఒక ఫెడరల్ రాజ్యాంగచట్టాన్ని ఈ పార్లమెంటులో ప్యాసుచేశారు. ఇవాన్

రిబార్ పార్లమెంటు అధ్యక్షుడేగాక, విముక్తిగావించబడిన ప్రదేశాలన్నింటికి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. ఇతడుగాకుండా మోసాపీజాదే అను సర్బియన్ నాయకుణ్ణి, ఇవాన్ అగస్టినిక్ అను క్రోట్ ప్రజానాయకుణ్ణి, జోసెఫ్ రూస్ అను స్లొవనీస్ ప్రజానాయకుణ్ణి, అధ్యక్షులుగా నియమించారు.

తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసిన సమావేశమే జనరల్ టిటోకు మార్షల్ పదవినిఇస్తూ యుగోస్లావియా దేశరక్షణశాఖ అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. టిటోకు సహాయ కమాండర్లనుగూడా ఎన్నుకున్నారు.

వీరుగాకుండా విదేశాంగశాఖకు జోసెఫ్ స్మోడ్లీకా (క్రోట్)ను, అంతరంగికశాఖకు వ్లాదో జెవిక్ (సర్బ్)ను, పునర్నిర్మాణశాఖకు ఒకరిని, అడవులు, గనులశాఖకు కలనల్ సులేమాన్ అను మహమ్మదీయుని అధ్యక్షులుగా ఎన్నుకున్నారు.

ఈవిధంగా ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రభుత్వమే టిటో ప్రభుత్వమని పిలువబడుతోంది. మొదటినుంచి ఫాసిస్టులకు వ్యతిరేకంగా ఒకటిగానిలబడిన ప్రజలే ఈ టిటో ప్రభుత్వంయొక్క వెన్నెముక. ఇప్పుడు టిటో ప్రభుత్వానికి, పీటర్‌రాజుకు, మిత్రమండలి ప్రభుత్వాలకుగల సంబంధాలను పరిశీలిద్దాం.

# రాచరికం నేలకూలుతోంది!!

"ముగ్గురు రాజులు" అనే శీర్షికక్రింద 'న్యూ స్టేట్స్‌మన్ అండ్ నేషన్' అను బ్రిటిష్‌పత్రిక 43 డిసెంబరు మొదటివారంలో ఈ దిగువవిధంగా వ్రాసింది:

"టెహరాన్ త్రైరాజ్య సమావేశంలో ప్రజాస్వామ్య సూత్రాలయెడల తమకుగల అత్యంతభక్తిని ప్రకటిస్తూ చేయబడిన మిత్రరాజ్య ప్రకటనలకూ-ప్రజాస్వామ్యానికంతకూ వ్యతిరేకంగా నిలబడుతున్న ఇటలీ, యుగోస్లావియా, గ్రీసు దేశాల రాజులను ఇంకా సింహాసనాలమీద కూర్చోనిస్తున్న మిత్రరాజ్యాలవైఖరికీ ఎంత వ్యత్యాసం కన్పిస్తోంది!"

ప్రజాస్వామ్య వ్యతిరేకచిహ్నాలైన పైముగ్గురి రాజులలో యుగోస్లావియా రాజగు పీటర్ ఒకడు. పీటర్ ప్రభుత్వం యుగోస్లావియా ప్రజలచే స్థాపించబడిన టిటో ప్రభుత్వాన్ని గుర్తించదు. దేశద్రోహిగా తయారైన తన యుద్ధమంత్రియగు మిహిలోవిచ్‌తో సంబంధాలు త్రెంచుకొనదు.

లండన్‌లోఉన్న పీటర్ ప్రభుత్వంలోఉన్న పెద్దమనుష్యులు ఎవరు? స్వదేశాన్ని వదిలివచ్చిన పాత ప్రభుత్వాధికార్లు, ఉద్యోగులు. పీటర్‌రాజుకు తమమీద నమ్మకం కలదు గనుక తామే యుగోస్లావియా ప్రభుత్వం అంటారు వీరందరూ. యుగోస్లావియాలో చిత్రించబడుతున్న నూతన ప్రజాచరిత్రను లండన్‌లోని ప్రభుత్వం గుర్తించుటకు ఇష్టపడదు. ఇష్టపడకపోయినా దేశరక్షణకొరకు యుగోస్లావియా ప్రజలుఐక్యమై తమ టిటోప్రభుత్వం క్రింద ఫాసిస్టులను ఎదిరించి విజయాలతరువాత విజయాలను పొందుతున్నారు.

'న్యూ స్టేట్స్‌మన్ అండ్ నేషన్' ఇంకా ఈవిధంగా వ్రాస్తోంది — "అమెరికన్ సర్వసేనాధిపతి అయిన ఐసెన్‌హోవర్ ఎన్ని ఫాసిస్టు సైన్యాలతో పోరాడుతున్నాడో అన్ని ఫాసిస్టు సైన్యాలతో జెనరల్ టిటో యుగోస్లావియాలో పోరాడుతున్నాడు. అందువల్ల కేవలం మిలిటరీ కారణాలవల్లనైనా గెరిల్లా సైన్యానికి మిత్రమండలి పూర్తి సహకారం ఇవ్వాలి. టిటోప్రభుత్వం స్లావనీస్, క్రోట్, సర్బియన్ ప్రజల ప్రభుత్వం. పీటర్‌రాజు ఇప్పటిమాదిరిగా దుస్సలహాలమీద ఆధారపడినా, లేక గెరిల్లాలు పూర్తిగా రాజును కాదన్నా, మిత్రమండలి పీటర్‌రాజును బలపరచుట అపహాస్యమే అవుతుంది."

కాని బ్రిటిష్ ప్రభుత్వం పీటర్‌రాజును బలపరుస్తూనేఉంది. ఇటాలియన్ ప్రజలందరూ ప్రభుత్వాన్ని వదిలిపెట్టి వెళ్ళమని కోరుతున్న విక్టర్ ఇమాన్యుయల్ రాజును బ్రిటిష్ అమెరికన్ ప్రభుత్వాలు బలపరిచినట్లే, ఇక్కడగూడా. గ్రీస్‌రాజు కథగూడాఇదే. గ్రీస్‌ప్రజలు గ్రీస్‌రాజును గ్రీసుకురావద్దని కోరారు. బ్రిటిష్ అమెరికన్ ప్రభుత్వాలు ఈ

రాజులను, రాచరికాన్ని, బలపరచాలనే ఆశిస్తున్నాయి. సోవియట్ ప్రభుత్వం మొదటినుంచీ యుగోస్లావ్ ప్రజల స్వాతంత్ర్య పోరాటాన్ని బలపరిచింది. చివరికి 43 డిసెంబర్‌లో ఏర్పడిన టిటో తాత్కాలిక ప్రభుత్వాన్ని గుర్తించుటకు నిశ్చయించింది. మిహిలోవిచ్ ద్రోహిఅని ఖండిస్తోంది.

గెరిల్లా సైన్యాలు 32 నెలలనుంచి యుగోస్లావియాలో హిట్లర్‌కు వ్యతిరేకంగా పోరాడుతున్నాయి. యుగోస్లావియా ప్రజాసైన్యం తాముసాగిస్తున్న పోరాటాన్ని గుర్తించి, సహాయం చేయమని పీటర్‌రాజును మొదటినుంచీ కోరుతూనేఉన్నాయి. మిహిలోవిచ్‌తో సంబంధాలు త్రెంచుకోమని కోరినాయి. పీటర్ రాజువద్దకు టిటోప్రభుత్వం తరఫున రాయబారాలుగూడా తీసుకొని వెళ్ళినాయి. ప్రస్తుతం విదేశాల్లోకూర్చున్న ప్రభుత్వాన్ని రద్దుచేసి. ద్రోహులతో సంబంధం వదలుకొని, యుగోస్లావియావచ్చి జాతీయ విముక్తి పోరాటానికి కనీసం నామమాత్రమైన నాయకుడుగానైనా ఉండమని పీటర్‌రాజును టిటో ప్రభుత్వం కోరినట్లుగూడా అనేకవార్తలు వచ్చినాయి. పీటర్‌రాజుకు స్వస్తిచెప్పాలనే ఉద్దేశ్యంతో మాత్రం టిటోప్రభుత్వం పనిచేయలేదు. జాతీయైక్యతను కాపాడుతూ ఫాసిస్టు దురాక్రమణ దారులను నాశనంచేయుటయే టిటోప్రభుత్వ ప్రధాన ఆశయం.

కాని పీటర్‌రాజు ఈ సూచనలకు అంగీకరించలేదు. పైగా "జనరల్ టిటో, ఇవాన్ రిబారీ" తో ఏర్పడిన యుగోస్లావియా ప్రజాప్రభుత్వం సరియైన ప్రభుత్వంకాదని, అది ఒక 'విప్లవకారులముఠా' అని 'కమ్యూనిస్టు దోపిడిగాంద్ర కూటమి' అని యేమోమో నిందలువేసింది. మిహిలోవిచ్ ఈలోపల అనేక ప్రకటనలను చేస్తూవచ్చాడు. "గెరిల్లా దళాలలో తాను యుద్ధంచేసిన విషయం నిజమేనని, గెరిల్లాదళాలు దేశాన్ని కొల్లగొట్టు న్నందువల్ల వారితో పోరాటం చేయవలసి వచ్చిందని" మిహిలోవిచ్ స్వీడిష్ పత్రికలో ప్రకటించాడు. గెరిల్లా స్వాతంత్ర్య పోరాటదళాలతో యుద్ధాన్ని సాగిస్తున్నానని మిహిలోవిచ్ అంగీకరించిన తరువాతగూడ పీటర్ మిహిలోవిచ్‌ను బలపరుచుట మానలేదు.

పీటర్‌ప్రభుత్వం ఏ వైఖరిని అవలంబించినా, టిటో ప్రభుత్వం నాయకత్వంక్రింద యుగోస్లావియా ప్రజలు సాగిస్తున్న ఫాసిస్టు వ్యతిరేకయుద్ధాన్ని ఎవరు కాదనగలరు? యుగోస్లావియానుంచి తప్పించుకొనివచ్చిన ఒక అమెరికన్ పత్రికావిలేఖరి గెరిల్లా పోరాటాన్ని గురించి ఈవిధంగా చెప్పాడు :

"జనరల్ టిటో తయారుచేసిన గెరిల్లా సైనికదళాలయొక్క అద్భుత మిలటరీ శిక్షణ, ఆదర్శక లక్షణాలు నా కాశ్చర్యం కలిగించినాయి. ఈమధ్య అలాంటి శిక్షణకల్గిన సైన్యాలను ఎప్పుడూ నేను చూడలేదు. టిటో సైన్యాన్నిచూస్తే, కాకసస్ ప్రాంతంలో ఫాసిస్టుల నోడించిన సోవియట్‌సేనాని నొవికొవ్ సైన్యం జ్ఞప్తికివచ్చింది. టిటోసైన్యం ఒక ప్రజాసైన్యం. ప్రజాసైన్య నిర్మాణంలో ఉండేలోపాలు కొన్నిఉన్నా. ఆ సైన్యం

యొక్క ఉత్సాహం అద్వితీయమైనదే" ఇటువంటి ప్రజాసైన్యం సాగించేయుద్ధాన్ని త్వరలోనే మిత్రమండలి ప్రజలతోపాటు ప్రభుత్వాలుగూడా గుర్తించాల్సి వచ్చింది.

బ్రిటిష్‌ప్రభుత్వ విదేశాంగమంత్రి అయిన ఈడెను పార్లమెంటులో మాట్లాడుతూ (డిసెంబర్ 14) "టిటోసైన్యాలు మిహిలోవిచ్ సైన్యాలకంటె జర్మనులను ఎక్కువ తీవ్రంగా ప్రతిఘటిస్తున్నాయి. అందువల్ల టిటోకు మిత్రమండలి ప్రభుత్వాలు సాధ్యమైనంత సహాయాన్ని చేస్తాయి" అన్నాడు. టిటోప్రభుత్వానికి సహాయం సరే బాగానేఉంది. కాని మిహిలోవిచ్‌కూడా హిట్లర్ సైన్యాలతో పోరాడుతున్నాడనే బ్రిటిష్‌ప్రభుత్వ అభిప్రాయం! మిహిలోవిచ్ ద్రోహిఅని బ్రిటిష్ ప్రభుత్వం గుర్తించలేదు. పీటర్‌రాజు గుర్తించలేదు.

ఈడెన్ ఇంకా,

"ఈమధ్యనే ఏర్పడిన టిటోప్రభుత్వం తాత్కాలిక ప్రభుత్వమేనని, యుగోస్లావియా విముక్తిపొందిన తక్షణమే యుగోస్లావ్ ప్రజలందరూ తమ కిష్టంవచ్చిన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకొనవచ్చునని గెరిల్లాలు స్పష్టంగా చెప్తున్నారు. పీటర్ ప్రభుత్వం యొక్క అభిప్రాయంగూడా ఇదే" అన్నాడు. ఈమాటలు చెప్తున్నప్పుడు పీటర్ ప్రభుత్వాన్ని అనుమానించే సభ్యులు ఆశ్చర్యబోయారు. యుగోస్లావియా ప్రజలు సాగించే స్వాతంత్ర్యయుద్ధాన్ని గుర్తించని పీటర్‌ప్రభుత్వం అంతవరకూ వస్తుందా?

బ్రిటిష్ ప్రభుత్వం మిహిలోవిచ్‌కంటె గెరిల్లా సైన్యాలకే ఎక్కువ సహాయం ఇస్తున్నదని పార్లమెంటులో అంగీకరించబడింది. యుగోస్లావియాలో ఫాసిస్టులకు వ్యతిరేకంగా పోరాడేవారందరికి సహాయంచెయ్యాలని బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఆరాటం! మిహిలోవిచ్ ద్రోహికిగూడా యిలా వుంటుందా?

పరిస్థితులు వడివడిగా మారిపోతున్నాయి. చివరికి బ్రిటిష్ ప్రభుత్వానికి తలలో నాలికలాఉండే 'టైమ్స్' పత్రికగూడా,

"యుగోస్లావియా జాతీయవిముక్తి పోరాటనాయకులను 'ఒక కమ్యూనిస్టులముఠా' లేక ఒక 'విప్లవవాదులముఠా' అనుటలో అర్థంలేదు. చెట్నికుక్క సైన్యాలయొక్క (మిహిలోవిచ్ సైన్యాలు) ప్రస్తుత నిస్తబ్దత ఫాసిస్టులకు సహాయకరమవుతోంది" అని వ్రాసింది. (43 డిసెంబరు 9)

'మిహిలోవిచ్'ను వదులుకొనిఅయినా గెరిల్లా సైన్యాలతో పీటర్‌రాజు రాజీపడితే మంచిదనే అభిప్రాయం క్రమేణా బ్రిటిష్‌ప్రభుత్వ వర్గాలలోగూడా బలపడుతూ వచ్చింది.

చివరికి చర్చిల్‌గూడా యుగోస్లావ్ గెరిల్లాదళాల ప్రముఖపాత్రను గుర్తించవలసి వచ్చింది. 44 ఫిబ్రవరిలో పార్లమెంటులో మాట్లాడుతూ, మిహిలోవిచ్ ఇటాలియన్, జర్మన్ ఫాసిస్టు ద్రోహులతో మిళితమైపోయాడని అంగీకరించాడు. యుగోస్లావియా

స్వాతంత్ర్య పోరాటంలో టిటో అగ్రస్థానం వహిస్తున్నారని, గెరిల్లాఉద్యమాన్ని నిర్మించిన కమ్యూనిస్టులు, గెరిల్లాదళాలు, ఫాసిస్టులను ఎదిరించి నిర్వహిస్తున్న మహత్తర పాత్రను గుర్తించాడు.

ఈలోపల టిటోసైన్యాల ఫాసిస్టు వ్యతిరేక విజయాలు అన్నిరాష్ట్రాలలో ఎక్కువయినాయి. మిహిలోవిచ్ సైన్యాలు గెరిల్లాదళాలతో సాగించే పోరాటంతప్ప, ఫాసిస్టులను వ్యతిరేకిస్తున్నట్లు ప్రకటనలుగూడా తగ్గిపోయినాయి. మిహిలోవిచ్ ఫాసిస్టు వ్యతిరేకుడై తేగా ఫాసిస్టులతో పోరాటం చేయటం?

బ్రిటిష్ ప్రభుత్వంతరపున ఒక మిలిటరీ ప్రతినిధికమిటీ యుగోస్లావియాకు వెళ్లిందని, టిటో సైన్యాలతో సంబంధాలు ఏర్పరుచుకుని ఫాసిస్టు వ్యతిరేకపోరాటం జరుపుతున్నారని, బ్రిటిష్ విదేశాంగమంత్రి అంగీకరించాడు. టెహరాన్ సమావేశసందర్భంలో సోవియట్ విదేశాంగమంత్రిఅయిన మాలటోవ్ ఈడెన్‌ను అడిగాడు "మీరు ఒక మిలిటరీ కమిషన్‌ను యుగోస్లావియాకు పంపారు; మేముగూడా ఒక కమిషన్‌ను పంపుతాము." బ్రిటిష ప్రభుత్వానికి ఈవిధంగా తెలియజేస్తూ సోవియట్ ప్రభుత్వంగూడా ఒక మిలటరీ కమిషన్‌ను యుగోస్లావియాకు పంపింది. ఈవిధంగా టిటో ప్రభుత్వానికి, మిత్రమండలి ప్రభుత్వాలకు సంబంధాలు ఎక్కువగుచున్నాయి.

"స్వతంత్ర యుగోస్లావియాశేడియో" ప్రకటిస్తున్న యుద్ధవార్తలు నమ్మదగినవే అని బ్రిటిష్ మిలిటరీ అధికార వర్గాల్లోగూడా ఒప్పుకుంటున్నారు. గెరిల్లా దళాలకు విమానాలద్వారా గూడా మిత్రమండలి ప్రభుత్వాలసహాయం ప్రారంభమయింది.

కాని పీటర్‌రాజు కదలడు. లండన్‌నుంచి కైరోకి చేరుకుని యుగోస్లావియా దగ్గరికి వచ్చినా, యుగోస్లావియా ప్రజాప్రభుత్వమైన టిటో ప్రభుత్వానికీ పీటర్‌రాజుకూ సంబంధాలు ఎప్పటిమాదిరిగానే ఉండి పోయినాయి.

గెరిల్లా ప్రభుత్వానికి ప్రాణం విసిగింది. దేశస్వాతంత్ర్యంకొరకు పోరాడుతున్న ప్రజలను గుర్తించని రాజుఅంటే విసుగుపుట్టింది. పైగా అతడు ద్రోహులతో సంబంధాలు త్రెంచుకొనకుండా జాతీయైక్యతను విచ్ఛిన్నంగావించుటకుగూడా ప్రయత్నిస్తున్నాడు.

ఈ పరిస్థితులలో 43 డిసెంబరు 22వ తేదీన మార్షల్ టిటో అధ్యక్షతక్రింద యుగోస్లావ్ జాతీయ విముక్తి సంఘం సమావేశమై పీటర్‌రాజు ప్రభుత్వంపై అనేక నేరాలను ఆరోపించింది. పీటర్ ప్రభుత్వహక్కులను రద్దుచేసింది. శత్రువిముక్తి కల్గిన తరువాతగాని యుగోస్లావియాకు రావలదని రాజును హెచ్చరించింది.

పీటర్ ప్రభుత్వం ఇప్పుడైనా కదిలి టిటో ప్రభుత్వాన్ని గుర్తించిందా? టిటో ప్రభుత్వం పీటర్‌రాజుమీద మోపిన నేరాలకు సమాధానం వచ్చిందా? లేదు.

కాని 44 జనవరి 4 వ తేదీన కెయిరోలో కూర్చున్న పీటర్ ప్రభుత్వం ఒక అధికార ప్రకటన చేసింది. పీటర్ ప్రభుత్వం తరఫున ప్రభుత్వఆఫీసర్లు యుగోస్లావియాలో టిటోతో కలిసి జర్మనులతో పోరాడుటకు వెళ్ళుచున్నారని. 17 మంది అప్పుడే సన్నాహమవుతున్నారని. ఇతరులుగూడా త్వరలోనే బయలుదేరుతారని ప్రకటన. ఇదంతా టిటో ప్రభుత్వంతో సామరస్యం కుదుర్చుకోడానికేనా ?

సామరస్యం కావాలంటే పీటర్ రాజు యుగోస్లావియా ప్రజలకు, గెరిల్లా సైన్య నాయకుడైన టిటోకు సమాధానంచెప్పాలి. ఇప్పుడు యుగోస్లావియా ప్రజలదే పైచెయ్యి అయింది. స్వాతంత్ర్యపోరాటంలో ప్రాణాలొడ్డి పైచెయ్యిని సంపాదించుకున్నారు ప్రజలు. ఈనాడు యుగోస్లావియా ప్రజాపోరాటాన్ని లెక్కించకుండా త్రోసివేయుటకు ఎవరికి సాధ్యపడగలదు? కాని పీటర్ రాజు, రాచరికానికి పతనం సమీపిస్తున్నప్పుడుగూడా, ద్రోహులనువదిలి ప్రజలతో ఎందుకు సమాధానపడుటలేదు ?

పీటర్ రాజుది సర్బియన్ ఆధిక్యతా సాంప్రదాయం. అతని ప్రభుత్వంలోనున్న మంత్రులందరియొక్క పూర్వచరిత్రలన్నీ ప్రజాస్వామ్యానికి వ్యతిరేకమైనవి. యుగోస్లావియాలోని ప్రజలమధ్య చీలికలుకల్పించి, వివిధజాతుల జాతీయోద్యమాలను అణిచివేసిన ప్రముఖులంతా పీటర్ ప్రభుత్వంలో ఉన్నారు. సర్బియన్ ఆధిక్యతయే ప్రధానంగా పరిగణిస్తూన్న వీరు ప్రజాస్వాతంత్ర్య ఉద్యమాన్ని బలపరుస్తారా ? వారి ఆధిక్యత నశించకుండా, ప్రజాఉద్యమం తలయెత్తకుండా, ఫాసిస్టులు ఓడిపోయి యుగోస్లావియా విముక్తిపొందాలి! అదీ వారికోరిక. ఈవైఖరి ఫాసిస్టులకు సహాయపడుతోందనిగూడా వారు గుర్తించరు. అన్నిటికంటె ముందు సర్బియన్ రాచరికం, సర్బియన్ బూర్జువా వర్గాల లాభం వారికి కావలసింది. దేశం ఏమైనాసరే.

కాని రాచరికం నేలకూలుతోంది. అన్నిదేశాల్లోను జరుగుతున్న యదార్థవిషయం ఇది. రాచరికాలను, సామ్రాజ్యవాద ఆశయాలను భగ్నంకావిస్తూ ముందుకు త్రోసుకొని వెళ్ళనియెడల ఫాసిజమే గతిఅవుతుందని యుగోస్లావియా, గ్రీసు, ఇటలీ ప్రజలు గుర్తించారు. రాజులు రాచరికంకొరకు వేచియుండవచ్చును కాని ఫాసిస్టు బానిసత్వానికి లొంగిపోయి, ఎవరో స్వాతంత్ర్యం తీసుకొనిరాగలరని వేచియుంటే ప్రజలయొక్కగతి — అవమానకరమైన బానిసత్వమే. అయితే యుగోస్లావియా ప్రజాపోరాటాన్ని గుర్తించవలసివచ్చిన బ్రిటిష్, అమెరికన్ ప్రభుత్వాలు, ప్రజలు స్వయంగా ఏర్పాటుచేసుకొన్న టిటో తాత్కాలికప్రభుత్వాన్ని ఎందుకు గుర్తించలేదు ? సోవియట్ ప్రభుత్వం గుర్తించినప్పుడు, వీరుగూడా గుర్తించి, మిత్రమండలి కమిటీలలో టిటో ప్రభుత్వానికిగూడా ప్రాతినిధ్యమిస్తే యుగోస్లావియా ప్రజలనేగాక ఆక్రమితయూరప్‌లోని ప్రజలనందరిని ఉత్తేజపరచుటకాదా?

మిత్రమండలిలోఉన్న సామ్రాజ్యవాద ప్రభుత్వాలుగూడా సోవియట్ ప్రభుత్వంతో పాటు ముందుకు సాగిపోయి జర్మన్ సైన్యాలకు వ్యతిరేకంగా చేయగల పోరాటాన్నిచేస్తూ,

ఫలితంగా సామ్రాజ్యవాదుల ప్లానులు భగ్నమయినాయి. చివరికి మిత్రమండలినుంచి అన్నిరకాల సహాయం చేరింది యుగోస్లావ్ ప్రజలకు. ఇతర దేశ ప్రజలందరూ ఎందుకు సహాయపడ్డారు?

యుగోస్లావియాకు సహాయంచేస్తే దానివల్ల బలపడేది ఒక యుగోస్లావియా మాత్రమేకాదు. అన్ని దేశాల ప్రజలకూ వచ్చిన ఫాసిస్టుప్రమాదాన్ని ఎదుర్కొనుటకే ఆ సహాయం ఉపయోగపడింది. సోవియట్ ప్రజల యుద్ధం ప్రపంచనాగరికతా స్వాతంత్ర్యాలనే కాపాడగల్గుతోంది. యుగోస్లావియా ప్రజలు సాగించే యుద్ధం హిట్లర్‌ను త్వరగా నాశనంచేస్తూ అన్ని దేశాల ప్రజలకు ఉపయోగపడుతోంది. ఈపరిస్థితి ఎందుకు యేర్పడింది?

ఇది ప్రపంచ ప్రజల యుద్ధం. ప్రపంచ ఫాసిస్టుప్రమాదం అన్నిదేశ ప్రజలకూ ఏర్పడింది. ఈ ప్రమాదాన్ని ఎదుర్కొటానికి అన్నిదేశాలప్రజలూ యుద్ధం సాగించవలసి వచ్చింది; సాగిస్తున్నారు. సోవియట్ ప్రజలు అందరికంటె ముందుండి ఎవరూ సాధించ లేనటువంటి విజయాలను సంపాదిస్తూ ఇతర దేశప్రజలనందరినీ ఉత్తేజపరుస్తున్నారు. అన్ని దేశాలప్రజలను ఉత్తేజపరిచే జాతీయైక్యతను సోవియట్ ప్రజలు నిర్మించారు. సామ్రాజ్య వాదుల అడ్డంకులు ఎన్ని ఉన్నప్పటికీ, అన్నిటినీ త్రోసివేసుకుంటూ స్వాతంత్ర్యయుద్ధం సాగించే ప్రజాయుద్ధ పద్ధతిని సోవియట్ ప్రజలు చూపించారు. యుగోస్లావ్ప్రజలు ఆదర్శ కరమైన సోవియట్ ప్రజల మార్గాన్ని అనుసరించారు; విజయమార్గంలో ప్రవేశించి ముందుకు నడుస్తున్నారు.

ప్రస్తుతయుద్ధంలో ప్రజలు ముందుకువచ్చి పోరాడనియెడల ఫాసిస్టులు జయించే పరిస్థితి ఏర్పడింది. ఫాసిజం జయిస్తే ఇంకేముంది? ఘోరబానిసత్వంతప్ప. ఫాసిజాన్ని నాశనంచేయుటకు సామ్రాజ్యవాదులకు సాధ్యపడదనిగూడా స్పష్టపడింది. ఫాసిస్టులను ప్రజలకు వ్యతిరేకంగా, సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా బలపరిచి, ప్రపంచ ప్రజలందరి నెత్తిమీదికి ఫాసిస్టు ప్రమాదాన్ని తీసుకురాగల్గినంతగా బలపడ్డ ఫాసిస్టులను ఎదుర్కొనేశక్తి లేకపోయింది సామ్రాజ్యవాదులకు. ప్రజల సహకారం, సోవియట్‌సహాయం అవసరమైనాయి; ఇక్కడే బయలుదేరింది ప్రపంచ ప్రజలకు మహదవకాశం.

అన్ని దేశాల ప్రజలు ముందుకువచ్చి తమ స్వతంత్రముకై ఐక్యమగుటకు అపూర్వ అవకాశం వచ్చింది. ఎవరిదేశంలోవారు ఐక్యమవుతూ సోవియట్ ప్రజలతోనూ, ఇతర ప్రపంచ ప్రజలతోనూ ఐక్యమయి స్వాతంత్ర్యపోరాటాన్ని ప్రారంభించారు. ప్రజాశక్తి విజృంభిస్తూంటే సహించలేని సామ్రాజ్యవాదప్రభుత్వాలు మధ్యలో అడ్డంకులు పెట్టూంటే, ప్రపంచ ప్రజల పరస్పరసహాయంతో అడ్డంకులను త్రోసివేసుకుంటూ ముందుకుపోయే అవకాశం ఏర్పడింది. కాని ప్రపంచప్రజల శక్తిమీద ఆధారపడి, వారి సహాయంతో స్వాతంత్ర్యమును సంపాదించుకోవాలంటే, తమ స్వదేశప్రజల శక్తిమీదనే ఆధారపడి

ఫాసిస్టు వ్యతిరేకపోరాటాన్ని ప్రారంభించవలసివచ్చింది. యుగోస్లావియా ప్రజలు అదే విధంగా ప్రారంభించారు. ప్రపంచ ప్రజలందరి శత్రువైన ఫాసిజాన్ని నాశనంచేయుటలో యుగోస్లావియా ప్రజలపాత్ర గుర్తించబడింది. ప్రపంచ ప్రజల సహకారం, సోవియట్ ప్రజలఅండ, యుగోస్లావ్ ప్రజల స్వాతంత్ర్యానికి ఆదుకున్నాయి. ఇదే యుగోస్లావ్ ప్రజల విజయచరిత్ర.

యుగోస్లావియా ప్రజలొక్కరేకాదు: ఈ ప్రపంచప్రజల వ్యూహంప్రకారం నడుస్తున్న దేశాలన్నిటికీ విజయాలు సమీపిస్తున్నాయి. మిత్రమండలి దేశాల ప్రజలందరూ ఈ విజయసాధనా మార్గాన్నే అనుసరిస్తున్నారు. ఎంత నిరుత్సాహపడిన ప్రజలనైనా ఉత్తేజపరిచే చరిత్ర చైనాప్రజల చరిత్ర. జపాన్ వ్యతిరేకపోరాటంలో ముందుండి పోరాడే చైనా కమ్యూనిస్టుపార్టీకృషివల్ల 1936 లో ఏర్పడిన జాతీయైక్యత ఈనాటికికూడా చైనాప్రజలను జపాన్‌కువ్యతిరేకంగా నిలబెట్టగల్గుతోంది. 45 కోట్ల చైనాప్రజల జాతీయైక్యతముందు జపాన్ కొన్నిప్రాంతాలను ఆక్రమించినా, దేశాన్ని జయించలేక కాళ్ళు తేలవేసింది. ఈ లోపల జపానుకే అన్నివైపులనుంచి మిత్రమండలిప్రజల వ్యూహం చుట్టుముట్టివేస్తోంది.

ఇతర యూరపియన్ ప్రజల చరిత్ర అందరూ కళ్ళారచూస్తున్నదే. స్వశక్తిమీద ఆధారపడితేనే స్వాతంత్ర్యం ఉన్నదని గుర్తించిన ప్రజలంతా, పూర్వం ప్రభువులచే పెట్టబడిన కలహాలనన్నింటినీ రూపుమాపుకుని స్వాతంత్ర్యపోరాటం చేయుటకై తలయెత్తారు. గ్రీసు, బల్గేరియా, ఇటలీ, ఫ్రాన్సు, డెన్మార్కు, నార్వే ప్రజల చరిత్రలన్నీ యీ ఐక్యతా సూత్రంమీదనే ముందుకు నడుస్తున్నాయి. ఇదివరలో ఎన్నడూ లేనంతగా బ్రిటన్ అమెరికా ప్రజలు ఐక్యమవుతున్నారు. ప్రపంచప్రజలందరి పోరాటపద్ధతి ఒకటే ఈనాడు. స్వాతంత్ర్య మార్గంగూడా నేడు అందరికీ ఒకటే.

ఇన్ని ప్రత్యక్ష ఉదాహరణలు కళ్ళారచూస్తున్న మనం నేర్చుకోవలసిన విషయం ఏమిటి ?

యుగోస్లావ్ ప్రజలు, చైనాప్రజలు, గ్రీసుప్రజలు, బల్గేరియాప్రజలు, ఫ్రాన్సుప్రజలు, ఇటలీప్రజలు, డెన్మార్కు, నార్వేప్రజలు, బ్రిటిష్ అమెరికన్ ప్రజలందరూ బోధిస్తున్న పాఠం ఒకటే :

మనదేశంలో జాతీయైక్యత నిర్మించుకొని, మన ప్రజలమీద ఆధారపడుతూ, ఇతర దేశప్రజల సహకారం, సోవియట్‌ప్రజల సహకారంమీద ఆధారపడుతూ, ఫాసిస్టువ్యతిరేక పోరాటంలో పాల్గొనుటయే — ఇదే మనదేశ విముక్తిమార్గం. మరొకమార్గంలేదు ఈనాడు.

ఈయుద్ధం మనది. ఎందుకంటే మనదేశాన్ని హరించటానికి ప్రక్కనే ఫాసిస్టు పిశాచం పొంచి కూర్చొనిఉంది. ఫాసిస్టుప్రమాదంనుంచి బయటపడుటకై దేశరక్షణ సాగించుట ప్రధానంగా మన దేశప్రజల కర్తవ్యం. ఇలాంటి ఫాసిస్టు ప్రమాదమువల్లనే

ఇతరదేశ ప్రజలందరూ వారివారి దేశాలను రక్షించుకొనుటకై, ఎన్ని అడ్డంకులు ఉన్నప్పటికి, నడుముకట్టారు.

"ఈ యుద్ధంలో ఫాసిస్టులనుఓడించినా మనకు సర్బియన్‌రాజుల దోపిడీ పరిపాలనయే గతిఅవుతుంది" అని నిరుత్సాహపడి యుగోస్లావియాప్రజలు కూర్చున్నారా? గ్రీసుప్రజలు కూర్చున్నారా? బల్గేరియన్ భూస్వాములే తిరిగి పరిపాలిస్తారనే భయంతో బల్గేరియన్ ప్రజలు కూర్చున్నారా?

ఎవరూ ఉపేక్షవహించలేదు. భవిష్యత్తులో మనకేం రాబోతోంది" అని వృధాచర్చలు సాగించలేదు. ఎవరిప్రజలమీద వారు ఆధారపడి, స్వాతంత్ర్యాన్ని నాశనంచేయాలని వచ్చిన శత్రువులను ఎదుర్కొన్నారు.

బ్రిటిష్‌ప్రభుత్వం జాతీయప్రభుత్వం ఇవ్వలేదని ఈదేశం మనదికాకుండా పోతుందా? జాతీయనాయకులను జైళ్ళలోపెట్టిందని దేశరక్షణ బాధ్యత మన బాధ్యత కాకుండా పోగలదా? ఆహారసమస్యను పరిష్కరించటానికి పరాయి ప్రభుత్వం ప్రజలసహకారం అర్థించటంలేదని, కరువుతో చచ్చిపోతున్న మన ప్రజలను మనం రక్షించుకోకుండా ఉండగలమా? మనదేశరక్షణకు మనం బయలుదేరితే, మనకోర్కెలన్నీ ఒకటి తరువాత ఒకటి సాధించవచ్చునని యుగోస్లావియా ప్రజలు ప్రత్యక్షంగా నిరూపిస్తున్నారుగదా! మనవిభేదాలను నిర్మూలించుకొని మనం ఐక్యమవుతూ, ఫాసిస్టువ్యతిరేక పోరాటంలో మన ప్రజల శక్తినంతా ప్రయోగిస్తే, ఈ శక్తిని ఎవరూ అడ్డుకొనలేరు. 1½ కోట్ల యుగోస్లావ్ ప్రజల జాతీయైక్యతముందు యూరప్‌ఖండమంతా ఆక్రమించిన హిట్లరు ఆగలేకపోతున్నాడు. మనది 40 కోట్ల ప్రజల అసమానశక్తి; ఈధాటికి ఎవరు ఆగగలరు?

అయితే మన జాతీయైక్యతకు మార్గం ఏమిటి? యుగోస్లావియా ప్రజలే దీనికి గూడా సమాధానం చెప్పారు. యుగోస్లావియాలో తరతరాలనుంచీ సర్బియన్లు, క్రోట్లకు జాతిద్వేషాలు ఉన్నాయి. దీనికి కారణం అధికసంఖ్యాకులైన సర్బియన్‌జాతికి చెందిన పాలకవర్గాలే. ఇతరజాతులు ఎంత ఆందోళనచేసినా సర్బియన్‌ప్రభువులు అణిచివేసేవారు. ఇప్పుడు — నూతనంగా దేశరక్షణకై అన్నిజాతులతో కలిసి ఏర్పడిన టిటో ప్రభుత్వం అన్నిజాతుల స్వయంనిర్ణయ హక్కులను గుర్తించింది. చిరకాల విభేదాలన్నీ వెంటనే పోయినాయి. ఉజ్వల భవిష్యత్తుకై అన్నిజాతులూ ఐక్యమయినాయి. అయితే జాతివిభేదాల చరిత్ర వివరాలలో భేదములున్నప్పటికి మనదేశంలో గూడా జాతివిభేదాలే మన పెద్ద బలహీనతగా తయారైంది. అన్నిజాతులవారి స్వయంనిర్ణయ హక్కులను గ్యారంటీచేస్తే, అన్ని అనుమానాలు అంతరించి జాతీయైక్యత ఏర్పడుతుంది. మనదేశంలో అనేకజాతులు ఉన్నాయి. ఆంధ్రులు, అరవలు, మలబారులు, కర్ణాటకులు, మరాటీలు, సింధీలు, బెలూచీలు, పఠానులు, సిక్కులు, రాజస్థానీలు, మొదలైన జాతులెన్నో ఉన్నాయి. ఈజాతుల మధ్య అనేక విభేదాలు ఏర్పడిఉన్నాయి. కాని దేశంలోని హిందూమతానికి చెందినవా

రెక్కువమంది జాతీయకాంగ్రెసును తమ పోరాటసంస్థగా బలపరుస్తూవచ్చారు. మహమ్మదీయ మతానికిచెందిన జాతులు ముస్లింలీగును బలపరుస్తూ-వచ్చినాయి.

మహమ్మదీయ ప్రజలందరి స్వాతంత్ర్యసంస్థగా ముస్లింలీగు తయారైంది. అందువల్ల కాంగ్రెసు-లీగు ఐక్యమయితే జాతీయైక్యత ఏర్పడగలదని కమ్యూనిస్టుపార్టీ చెప్తోంది. అనగా వివిధజాతుల స్వయంనిర్ణయ హక్కును గుర్తిస్తూ, దేశంలోని పెద్దసంస్థలైన కాంగ్రెసు-లీగులు ఒడంబడిక చేసుకుంటే అన్నిమతాలవారు ఐక్యమవుతారు. అన్నిజాతులవారు ఐక్యంకాగలరు. అంతేకాదు. వివిధజాతుల ప్రజల స్వయంపరిపాలనా హక్కును గుర్తించేపక్షంలో సోదరజాతుల ప్రజలందరూ ఐక్యమవుతూ మతాలపేరిట ఆధిపత్యాన్ని సంపాదించాలని ప్రయత్నించేవారి ప్రయత్నాలనన్నింటినీ భగ్నంచేయగల్గుతాము. స్వయంనిర్ణయహక్కును గుర్తించనంతకాలం విభేదాలు. పరస్పర అనుమానాలు అన్నీ అలాగే ఉండిపోయి, మతద్వేషాలను ప్రేరేపించేవారి ప్రయత్నాలకు ప్రజలు లోనగుటకు అవకాశం ఉంటుంది. అందువల్ల మహమ్మదీయమతాన్ని అనుసరించే జాతులవారందరి స్వయంనిర్ణయహక్కును భారత జాతీయపోరాట సంస్థఅయిన కాంగ్రెసు గుర్తించాలి. అలా గుర్తించినపుడు, మహమ్మదీయులుకూడా ముందుకువచ్చి జాతీయనాయకులను విడిపిస్తారు. జాతీయైక్యతను సాధించేమార్గం ఇది ఒక్కటే.

అన్నిదేశాల కమ్యూనిస్టుపార్టీలతోపాటు భారతదేశ కమ్యూనిస్టుపార్టీగూడా ఈ జాతీయైక్యతా ఉద్యమాన్ని ప్రారంభించింది. అన్ని ప్రజాసమస్యలమీద వివిధజాతులకు చెందిన ప్రజలను, హిందూ-మహమ్మదీయ సోదరులను ఐక్యంచేయుటకు కమ్యూనిస్టులు కృషిచేస్తున్నారు. దేశభక్తులందరూ ఐక్యతామార్గాన్ని అనుసరించినప్పుడే యుగోస్లావియా ప్రజలు నిర్మిస్తున్న చరిత్రకు 1000 రెట్లు ఎక్కువ మహత్తరచరిత్రను మనం నిర్మించగలం. మనదేశ అనైక్యతమీదనే ఆధారపడి కూర్చున్న సామ్రాజ్యవాదులను మన ప్రజలఐక్యత, సోవియట్ మొదలైన ఇతరదేశప్రజల సహకారంతో వంచగల్గుతాం.

కాని అన్నింటికీమూలం ప్రజల శక్తిమీద నమ్మకం. మనదేశ ప్రజలు, ఇతరదేశ ప్రజలు — వీరే భవిష్యత్తును నిర్మించేది. అజేయమైన ప్రజాశక్తియే మన మూలాధారం.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B196 |
| పుస్తకం పేరు | యుగోస్లావియా స్వాతంత్ర్య పోరాటం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |